# ఆకలిమంట

(సాంఘిక నాటకము)



రచయిత:

## శ్రీ వేదాంతకవి



పబ్లిషర్సు:

కురుకూరి సుబ్బారావు అండు సన్స్,

ప్రొప్రయిటర్సు:

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

మొదటి కూర్పు 1000

1945



వెల 1-2-0

# హెచ్చరిక

నా లిఖితపూర్వకమైన అనుమతి లేనిదే యెవ్వరూ యీ నాటకాన్ని యెక్కడా ప్రదర్శించకూడదు. ఏ విధంగానూ ప్రకటించుకొనరాదు. ఏమాదిరి వ్యాపారాలకి ఉపయోగించుకొనరాదు.

కవితా సంస్థానము — వేదాంతకవి.

అను

బెజవాడ — వేదాంతం వేంకట
14-2-1945 — సుబ్రహ్మణ్య శాస్త్రి.

# నా వుత్సాహం

వేదాంతకవిని, 1939 నుంచీ యెరుగుదును. లోకులు యితన్ని గడుగ్గాయని, బొడుద్ధాయని తిట్టటంగూడా యెరుగుదును. యేదో కాంతా కాంచనాదులమీద రాసే 'పద్యాల బత్తుఁడని' మొదట్లో దురభిప్రాయపడ్డాను.

కాని వీరి భగవన్మతభాష్యానికి పీఠిక చూచినాక, నా అభిప్రాయాన్ని మార్చుకున్నాను. కవిహృదయం గుర్తించాను. సంఘంలో రెండువర్గాలున్నవని గ్రహించాడు—కలవారు, లేనివారు. లేనివారి సమస్యలకోసం రాయాలనికోరే వుడుకుబుర్రలోని ఆవేదన ఆకట్టాను. కావ్యాన్ని విశ్వశ్రేయస్సుకోసం వాడాడు.

లోకం యీయన్ని చల్లగా చూడలేదు. లోకహర్తలైన కలవారి సమస్యల్ని యీయనా చల్లగా చూడలేదు. వీరిరచన్లు పూర్వభావులకు యినపగుగ్గిళ్ళు. కొత్తవారికి మార్గమింట కారులు. అనగలడు; అంటే పడగలడు. మనిషి సన్నగావున్నా, కండగల కవిత్వం రాయగలడు. చెప్పదలచుకుంది ఒకరి మొఖవాటంకోసం మభ్యపెట్టడు. యితరుల అలా[illegible]కన్నా తమ అలారాన్ని బిగ్గరగాకొట్టించి, యీ రేడియోయుగంలో మేకు బిగింపుపర్వాలు తగిలిస్తున్నాడు.

ప్రోత్సాహానికి తగినవాడు; ప్రోత్సాహం యివ్వకపోయినా నిరుత్సాహపడేవాడు కాడు. కష్టకాలంలో కేగే ఆకలిమంటలకు అలమటించి, తమ కవితాగుణాన్ని ప్రచారసాధనంగా వాడుకునే నేర్పరి.

వేదాంతకవికి ప్రోత్సాహంగా యీ నా వుత్సాహాన్ని యిస్తున్నా.

తెనాలి 12-2-45. ఆవుల గోపాలకృష్ణమూర్తి

M. A. L. L. B.

# దేముడి గతి



ఆకలిమంట వురెడబట్టే మానవుడు కోదండాన్ని ధరించి (Primitive Communistic Stage) వేటాడి ఆకలిమంటను చల్లార్చుకుందుకు తంటాలుపడ్డాడు. అప్పటికీ ఆకలిమంట చల్లారకపోతే మానవుడు నాగల్తోపాటు దైవాన్ని సృష్టించుకుని భూమితో వేట సాగించాడు. అప్పటికి ఆకలిమంట చల్లారకపోతే మానవుడు యంత్రాల్ని సృష్టించాడు. ఈ యంత్రాలు ఆకలిమంటల్ని మరీ రెచ్చకొట్టినై. అప్పుడు మానవుడు తత్వాలు (Isms) సృష్టించాడు. ఈ తత్వాల్లో నిఖార్సైన తన తత్వం (Socialism) తో యంత్రాల్ని జోడిస్తే ఆకలిమంట చల్లార్తుందని మార్క్స బల్లగుద్దిచెప్పాడు. దాన్ని నమ్మి ఈశకం మానవుడు దేముడుతో గీముడుతో జరూరత్ లేదని కేక లేస్తున్నాడు. దేముడికి నిజంగా ఛలామణీ లేని నాణెంగతి పట్టిందేమో అనిపిస్తుంది ఈ నాటకం సాంతం చదివిన తర్వాత.

S. S. చక్రవర్తి,

10 - 2 - 45.

(డా. జంధ్యాల దక్షిణామూర్తి)

# ప్రాణదాత

# కృతి.

ఆ. బ్రహ్మలిఖితమందు పడిగూడ నీ మందు
ప్రాణదాతవైన వైద్యరాజ
ప్రేమ - జూమ దక్షిణామూర్తి నీకంటె
తాటబడుట కెవడు నోట రాదు.

మ. పసికూల్ముసినవ్వుతో మురిసి
కోపం బేమిటో బోధగా
ని సహాధ్యాయుడవై అమాయకు
డవై నే డింత పెన్ప్రగ రా
క్షసులం నీ వెటువంటి శక్తిగల
శిక్షా దక్షిణామూర్తి! యే
కసి శిక్షించితివో త్వదీయ
ఘనవిఖ్యాతుల్ ప్రకంపించెడిన్.

ఉ. మేలిమివంటి శౌర్యకల మేరు
వులఁ మును మీ బలాలు జం
ధ్యాలకు జుట్టి మూఁడు భువనాల
పయిఁ విదళించినప్పుడే
మేలిమిచాయ వచ్చినది మీకు, మ
రేమిటో? యింటిపేరు జం
ధ్యాలుగ నిల్చె నింక శపథాల
ను వీడరె వైద్యరత్నమా!

ఉ. ఈ నగుమోములో మొలకలెత్తిన
వేమిటోగాని యింత సం
స్థానములో శిరీష కవితావన
రాజ్య రమాలలామ వీ
ణా నలినీ నినాద చరణాలను
మాలినితోడ నేడు పా
రాణలు వ్రాయుచున్నవి విరా
జిత వైద్యకలామనోహరా!

కవితాసంస్థానము.
బెజవాడ
14—2—45

ఇట్లు
వేదాంతకవి

# యుగాలు - ఆగాలు



ఫొటో కెమేరాలు కళ్ళల్లో వున్నై కాలీబోలు, నా చూపుకీ, నా కలానికీ, నిద్రపట్టడం లేదు. కష్టకాలాలూ, ఆకలిమంటలూ లేచి చేస్తున్న ఆగాల్ని చిత్రించటానికి; నా కలం యెన్నెన్ని రోజులమీద పరుగులు పెడుతున్నదో కాస్త పారజూస్తే తెలుస్తుంది.

ఈ యుగంలో కొంతమంది మొనగాళ్ళ కళ్లు వెనకభాగాన వుంటే, వాఙ్మయ ప్రపంచాన్నీ మానవ జీవితాల్నీ వెనక్కి లాక్కుపోవటాని కింతపళ్లు బిగించరు. ముందుచూపుచూస్తున్న కళ్ళకి కళ్ళాలు పెట్టి, వెనక్కి లాక్కుపోతున్నందువల్ల పాపం! నానాబాధలు పడుతున్నారు.

బాణాకర్రలవార్కీ, దివాణాలవార్కీ; కజానాలవార్కీ వేసిన ఆకలిమ్మంటల్లో యెన్నోయుగాలనుంచి, ఇన్ని ఆగాలు లేస్తున్నై. వీళ్ళంతా చావూ పుటకాలేని దేవుణ్ణి తెచ్చి వీరంగాలువేసి యెట్లా ఆకలిమంట చల్లార్చుకొంటున్నారో నాటకంలో గిల కొట్టాను!

వేదాంతకవి.

ఈ నాటకంలో దిగుతున్న

# నటీనటుల పరిచయాలు.

హాలాహలం— నిరుక్షేద, విప్లవప్రజాహృదయుడు, నేటికథానాయకుడు.

కోలాహలం— సుకుమార సుఖభోగలాలసుల సావాసగాడు సంస్థానాలమంత్రి, సనాతన సిద్ధాంతవేత్త.

దురాగ్రహి— జగన్మాత పెద్ద కొడుకు, సౌందర్యోపాసకుడు, యథార్థవాది, బంధువిరోధి.

సత్యాగ్రహి—జగన్మాత ముద్దు బిడ్డడు, అమాయకుడు, అయోమయ బ్రహ్మచర్య తపోనిష్ఠాగరిష్ఠుడు.

దేవుడు — అయోమయంగా బ్రదుకుతున్నవాడు, జగన్మాత భర్త.

డాక్టరు — అసలు కథానాయకుడు, రసికుడు.

పృథ్వీపతి — దేవుని తమ్ముడు, సంస్థాన ప్రభువు, భూదేవి భర్త.

మాలా — డాక్టరుగారి కాంపౌండరు చమత్కారి.

స్త్రీలు :

జగన్మాత — పెద్దముత్తైదు, దేవునిల్లాలు.

శక్తికాంత — అప్టుడేటు గరల్, దురాగ్రహి భార్య.

ముక్తికాంత—పురాతనపు కోడలు, సత్యాగ్రహిభార్య.

భూదేవి — పృథ్వీపతి భార్య.

శ్రీ

# ఆకలిమంట

## ప్రథమాంకము

1వ రంగము—వీధి

కీర్తన పాడుకొంటూ

హాలాహలంతో ప్రజలు ప్రవేశిస్తారు.

వినరా ఆకలిమంటా కథలూ
ప్రాణాలు పోవని వ్యథలూ ॥వి॥
మలమల మాడిచి
ప్రళయము లేపెడి ॥వి॥
అదిగో! కొండాలూ కరిగే మొఱలూ
సింహాలూ చిక్కిన చెఱలూ ॥వి॥
జగములు ఘోషిలి
జలధులు లేచెడి ॥వి॥

(ప్రజ లంతా నిష్క్రమిస్తారు)

హాలాహలం (నిలిచి)

హాలా—ఈ సమస్త విశ్వసంస్థానప్రజలకష్టం నానాఁటికీ మహాఘోరంగా వుంది. ఆర్చేవారూ లేరు. తీర్చేవారూ లేరు. అగ్ని దేవుడికి వాయుదేవుడు తోడైనట్లు ఈ ఆకలిమంటలకి

మతకలహాలుకూడా బాగా తోడుపడ్డై. బ్రహ్మాండాల్ని మండిస్తున్నై. తగలపడుతున్న కొంపలో ఎలుకల్లాగా ప్రజలంతా మాడి చస్తున్నారు. ఈతరుణంలో ఒక్క దయాగనహృదయుడైన మహాత్ముడూ లేడు, నాయకుడూ లేడు.

పిడుగులు రాల్చు మేఘుడు వచ్చి గర్జింప
గూలిపోయిన పేద కొంప లన్ని
త్రోవం బూడ్చెడి మంచుదొరపట్టి కసరగా
తలబోసిపోయిన తరువు లన్ని
ఱోళ్ళ బ్రద్దలగొట్టు ప్రొద్దు గద్దింపగా
ఎండిపోయిన సెలయేరు లన్ని
సుడిపెట్టి పడగొట్టి వడగాడ్పు గొట్టగా
స్పృహతప్పి పడియున్న జీవు లన్ని
నలిగి నాల్గువేదాల నాణ్యంబు గనిన
బోసినోటి తొలకరికై మోరలెత్తు
కొన్ని జపించుచున్నవి నేడు కనికరించి
పోవుట కెపుడు ఆ మహాత్ముండు కదలు?

కోలాహలం ప్రవేశం

కోలా—అయ్యా! మీరు కోటలోకేనా దయచేటం?

హాలా—కోటగుమ్మాలలో మాకేం లేదు.

కోలా—అదేమిటండి: అట్లా అంటారు! రాజదర్శనం చేసుకుపోదురుగాని రండి!

హాలా—రాజదర్శనాలు మా కక్కర్లేదు.

కోలా—అయితే మీ కేదర్శనాలు కావాలి?

హోలా—న్యాయనిదర్శనాలు కావాలి (నిష్క్రి)

కోలా—ఓహో చాలాదాకా వుంది వ్యవహారం!

(తలుపు తీసుకొని.

దురాగ్రహి-శక్తికాంత ప్రవేశం)

దురా—ఏమిటండి విశేషాలు కోలాహలంగారు?

కోలా—ఆ! ఏమున్నై. ఇదిగో! ఇంతకుమునుపే యెక్కడిదో మాయదారి గుంపు గోలపెట్టుకొంటూ పోయింది.

దురా—దానిజోలికి పోలేదుకదా మీరు?

శక్తి—అసలు ఈగుంపు ఎక్కణ్ణుంచి బయల్దేరింది?

దురా—ఆకలిమంటల్లోంచి.

కోలా—అదాకథా! అందులో వొకణ్ణి కదలించి చూస్తే యిదే గోడవెత్తుకొన్నాడు.

దురా—మీరు కదలించింది ఆ వస్తున్నవాణ్ణేనా?

శక్తి—వస్తున్నది మహాలానాహెబుగా.

దురా—ఆతనివెంటవున్న రెండోవాడు?

కోలా—(బెదరుచూపుతో) అతఁడేనండి. పోతా.

(పోబోవును)

శక్తి—(నవ్వి) ఎందుకట్లా కంగారుపడతారు?

దురా—ఎందుకా! కోలాహలంవెంట హోలాహలం పడబట్టి.

శక్తి—ఈయనపేరు కోలాహలమా ఏమిటి?

దురా—అవును. ఇతడిపేరు కోలాహలం. అతడి పేరు హోలాహలం,

కోలా—మళ్ళీ కనపడతాలెండి. తొందరపనిమీద వెళుతున్నా (పోఁబోవును)

దురా—(నవ్వి పట్టుకొని) ఎందుకయ్యా! ఇంత భయం?

గీ. ఉక్కుకోటలో బంగారు ముక్కపగిదీ
కులుకు కోలాహలమ్మనకు భయ మేల?
గడగడ వణకుచున్నాడు కడకు నేడు
ప్రజల ఆకలిమంట కారణము కాదె?

కోలా—సరేలెండి, వదలుదురు బాబు! తొందరపని వుంది.

శక్తి—నీకూ నాకూ తొందరపనులు లేందెప్పుడు?

(మాలాసాహెబు ప్రవేశం)

మాలా—జీ. దురాగ్రహీ మహారాజ్! సలాంలేఖుం ఏ ఖోలాహాలంగార్కి హేమిట్లా సాలా ఘాబరాపడ్తుండార్?

శక్తి—ఏం లేదు పాపం. కోటల్లో వాళ్ళకోసం—

మాలా—హావునూహాండీ కోటల్కి నల్లాగా హుంటే హీర్కి ఖోలాహాలంకీ నల్లాగా హుంటాద్.

కోలా—కోటలూ, కోలాహలాలూ, కూలిపోతుంటే మీకళ్ళు చల్లగావుంటై. వెళ్ళనియండి. (పోఁబోవును)

దురా—(పట్టుకొని) ఉండవయ్యా పోదువుగాని. మోహముతో సదాభువనమోహనమూర్తులు సర్వసైన్య సన్నాహము వెంట పంపి రతనాల దివాణములో బిగించు కోలాహలమున్ మరెంతటి బలాఢ్యులుగూడ జయించలేరు; నీ సాహసలక్ష్మి కింత బలసంపద యున్న భయ మ్మదేటికో.

కోలా—బాగానేవుంది గొడవ. భయంలేనివాడు బ్రతకలేడు.

మాలా—ఫిర్కీహుండావార్, దేస్కీ ఫస్కీరార్.

కోలా—అంచేతనే పోనియ్యమంటున్నది (నిష్క్రి)

శక్తి—ఇతని కెంతసేపూ మేడమిద్దెల్లో మేయటం అలవాటైంత ర్వాత కాలు కింద నిలుస్తుందా మటీ.

మాలా—హీడ్కీ బల్ టక్కరూహాండి. హీడీ తమాషా హిక్డా హేమ్టా హుండాదండి దివాణంలో నూడాలా.

శక్తి—అవును దివాణాల్లో చాలా జబర్దస్తీచేస్తాడు. నిజంగా అంతే.

దురా—

గీ. పొలములో తిరిగెడి గొర్రెపోతుపగిది
పెరుగుచున్నాఁడు పెద్దజాతరకు నేడు
తెగబలిసి వీనికండ కత్తిపదు నింక
చూచు నంచు వచ్చినదారి జూచెనేమొ.

శక్తి--అందుకే అంత భయంతో కొట్టుకొంటుంటాడు.

గీ. అంతబలిసెడివానికి ఇంతభయము
గుండె పగులగొట్టుట దేనికో జగాన
వీని సోమరితనములో పిఱికితనము
పుట్టినదియేమొ రండోలుపొట్ట చిట్లు.

మాలా—ఏబాత్ సచ్ బాత్ హై హమ్మా! నూడండీ హీడ్కీ హేప్డా హోంటర్గా భయటీ రాడ్. మీకే సెప్పింది సత్తెం తల్లీ!

దురా—అయితే మాలా! మీ డాక్టరుగారు ల్లో వున్నారా?

మాలా—హైజీ. మీకోసం కబుర్ సేశార్.

దురా—శక్తీ! అయితే నీ విండ్లోకి వెళ్లు డాక్టర్ గారింటికి వెళ్ళివస్తా

శక్తి—మై జంటిల్ మెన్ కమ్ సూన్

దురా—సరే పదవోయ్ మాలా! వెళ్దాం (ముందు నడుచును)

మాలా—(డాక్ట రిచ్చిన కవర్ శక్తికి చాటుగా యిచ్చి) సలామ్ హామ్మా! ఫోయి వస్తాన్ (నిష్క్రమింతురు)

శక్తి—మంచిది

(తత్తరపాటున ఉత్తరం తీసుకొని శక్తికాంత నిష్క్రమించును.)

[ తెర పడును ]

2వ రంగం

దురాగ్రిహ పడకగది

(తలుపులు వేసుకొని శక్తికాంత ప్రవేశం)

శక్తి—(డాక్టరు వ్రాసిన ఉత్తరం చదువుచుండును) నా మధురమధుర గానసుధారస తరంగిణీ! నీ ప్రేమనందనో ద్యాన వసంతుణ్ణి మరచిపోయినావా? ఏదీ చాలాకాలమైనను మఱపుకు రాకున్న నీ మధురమంజుల వాగ్విలాసము? (నవ్వి) ప్రేమసామ్రాజ్య సింహాసన పట్టభద్రురాలా ఏమిటి వీరు? (తిరిగి ఉత్తరం చదువును) సుందరాంగీ! సుకుమారలతాతన్వీ! అయితే! ఇంత చాదస్తమైన వ్రతాలతో మతాలతో నీ

స్వచ్ఛమైన నవయౌవన నందనవనాన్ని ఎందు కట్లా వాడిపో నిస్తున్నావు? (నవ్వి) ఎందుకా! చల్లని మలయమారుతాన్ని వడగాడ్పుల్లో కాగబెట్టడంవల్ల, నిప్పులు చెలుగుతున్న యీ మండుటెండల్ని కాయుటంవల్ల. ఏం ప్రయోజనం?

గీ. ఎన్ని సౌందర్యసౌధమ్ము లెక్కియున్న
ఎన్ని మేలితొడవులు ధరించుకొన్న
శ్రావ్యసంగీత వీణా సరస్వతివలె
సుగ్రతులు కల్పుకొని సుఖసంస్థుతులుగారె.

(తలుపుచప్పుడు విని) ఎవ రక్కడ?

(జగన్మాతప్రవేశం)

జగ—(పెద్ద విసుగుతో) ఎవరా! ఈదవడా ఆదవడ వాయించుకొన్నవారు.

శక్తి—ఏమటండి, ఎప్పుడూ ఏదో గోలపెడతారు?

జగ—గోల పెట్టక ఏంచేస్తారు మఱి? ఆసి దానమ్మ కడుపు బంగారమైపోనూ, ఎప్పుడూ ఘడియలు బిడాయించు కొని కూర్చోటమేనా?

శక్తి—కూర్చుంటే మీ కేం అడ్డు వచ్చిందండి?

జగ—ఏం అడ్డువచ్చిందా! చేయబోతున్నది. ఆడ దిట్లా పనీ పాటీ లేకుండా కూర్చుంటే కొంపలో అంతా అడ్డమే.

శక్తి—మీ రంతా చేస్తుంటే మేం అడ్డం రావటం బాగుంటుందా మఱి?

జగ—అయ్యో పాపం! ఎంత దయవచ్చి ఛక్కని సమాధానం ఇచ్చావే?

(దేవుడు ప్రవేశం)

దేవు—ఏమి టది? గోల చేస్తున్నావు?

జగ—ఇహ మీరుగూడా వచ్చారుగదా, మండి మారణమైపోతున్న గోల చల్లార్చుకోండి.

దేవు—ఒక్కనాడూ కోడ ళ్ళిద్దర్నీ పెట్టుకొని ముచ్చటగా కనపడవుగదా?

జగ—నాకు చేతకాదు మహాప్రభో! మీా రన్నా మఱి ముచ్చట తీర్చుకోరాదు?

దేవు—ఏమిటి? శక్తికాంతా! మీా అత్తగారిగోల?

శక్తి—ఏ మున్నదండి. ఇంట్లో మే మంతా అడ్డం వస్తున్నామట!

దేవు—నీ తోడికోడలు, ముక్తికాంత యేది?

జగ—అదిగూడా యెందుకు? కూసేగాడిద వచ్చి మేసే గాడిదను చెడగొట్టిందట. ఇహదాన్నిగూడా తయారుచేయాలా?

శక్తి—మీా రిట్లా ఎవరివల్ల తయారైనారు?

జగ—నాజోలి నీ కెందుకు? ఆటే వాక్కు.

శక్తి—ఎందుకా అడిగిం దానికి?

జగ—నిన్నేం అడగలేదు. అడగదలంచుకోలేదు.

దేవు—ఇందాకట్నుంచీ అడగటంగాక ఏ మంటారు?

శక్తి—ఆగ్రహ మంటారు.

జగ--అహా! ఆగ్రహంరాక అనుగ్రహంవస్తుందికూరోచ్చ.

(ముక్తికాంత ప్రవేశం)

ముక్తి—అక్కా! నీ చీరలుగూడా వెయ్యి, ఉతుక్కొని వస్తా.

జగ—ఆసి వెట్టిబాగుల్దానా! దాని బట్టలు నీవు వుతకట మెందు కే?

దేవు—మధ్య నీ వెందుకు వాళ్ళిద్దరికీ?

శక్తి—రాపిడి పెట్టటానికి.

జగ—రాపిడీ, దోపిడీ, నీకు చేతైంది. నీ పుట్టింటారికి రాపిడిపెట్టుకో. నీపుట్టింటారిముల్లె దోపిడిచేయించుకో. నన్నాటే ఎందు కిట్లా మండిస్తావు? నీ నాజూకులకీ, నీ మొగరాయడి వేషాలకీ, మే మేమాత్రం చెలామణి కాకుండా పోయినాం గాని, నీసంగతి నీవు చూచుకో. ఇట్లా మా పాలబడి మమ్మ ల్నెందు కేడ్పించుకొనితింటావు? నిలువునా ఇల్లిట్లా గుండం ఎందుకు వేస్తావు? నీదారి నీవు చూచుకొంటే మంచిది. ఇట్లా కూర్చోపెట్టి ముప్పూటా మేపలేం.

దేవు—నీవు రమ్మంటే వచ్చేట్టూ, నీవు పొమ్మంటే పోయేట్టూనా? ఏమిటీ చూస్తున్నకొద్దీ పాడుగీర్వాణంపోతావ్? నోర్మూసుకొని కూర్చో. నీవు తెచ్చిందేముంది? పెట్టేదే ముంది? ఎందుకట్లా నోరు పారేసుకొంటావు?

జగ—పారేసుకోనూ? బంగారంవంటి కాపురాన్ని చెట్టుబొగ్గులు చేస్తుంటే, చూస్తూ కూర్చుంటానా? అట్లా కూర్చోటం నాకు చేతగాదు. ఇంకా మీరుగూడా తోడువడ్డా రుగా? ముదిరిపోక యేమాతుంది? ఎట్లా నడుంవంచి పనిచే స్తుంది? కోడళ్ళు కోడవళ్ళై, కొడుకులు తుమ్మపుడకలై చేసు కొన్న మగడు నెగడై మండిపోతున్నప్పుడు కొంపేంబాగుపడు తుంది? మేరువంత ఆస్తి, నీతమ్ముడు లాక్కొని పోయినాడు. ఇహా ఈ కొంపా గుడిశా, నీ కొడుకులూ, కోడళ్ళూ పీక్కొని

పోండి. ఇహ నేనేగా మిగిలింది? నే నింకా ఏ ఏట్లో కలిస్తే మీ కెందుకు? (ముక్తికాంతవైపు) అసి పదవే ముక్తీ! నీ వొక దానివి దొరికావు నా ప్రాణాలకి. పట్టి వెళ్ళగొడ్డువి. నీకు మంచీ చెడూ తెలియదు.

ముక్తి—ఇవాళ్ళ మన్నీళ్ళుగూడా నేనే తెచ్చి వంట వండుతాలెండి.

జగ—నీ మడీగిడీ నాకేం పనికిరాదు పదా. ఇంకా మోపెడు గుడ్డలూ మోసుకొనిపోయి కూర్చుంటావు కామల్లు?

ముక్తి—త్వరగానే వస్తా అత్తగారు. (నిష్క్రమించు)

శక్తి—చాదస్తంగాకపోతే ఏమి టిది? చాకలివాళ్లు వచ్చి తీసికొనిపోయే గుడ్డలికి మళ్ళి యి పిల్లెందుకు?

జగ—ఆహా! నీవు చెప్పావుకాదని, ఎందు కేళ్ళొచ్చి? పొయ్యిలోబడ్డ యేళ్లు. థూ మనిషైపుట్టింతర్వాత మానాభిమానా లుండాలి. (నిష్క్రమించును)

దేవు—దీని కెప్పుడూ ఉన్న గుబులే యిది. నీవేం కష్టం పెట్టుకోవద్దు. లెఖ్ఖా పెట్టొవద్దు, మా అమ్మవుగదూ! శక్తికాంత! నీ ఓర్పుతో నీ నేర్పుతో మీఅత్త కెప్పటికైనా బుద్ధి రాక మానదు. వస్తుంది.

శక్తి—ఏమిటి వచ్చేది బుద్దీని గిద్దీని? అనేమాటా అనీ అనగూడని మాటా అని లేదు. నోటి కెంతవస్తే అంత. ఛీ మనిషైపుట్టింతర్వాత కామన్నెన్నుండాలి. ఈ పాపిష్టిగోల మేము పడలేముగానీండి మామట్టుకు మేం వేలుపడతాం. ఎబ్బె రోజూ వొకటే సాధింపా, పాడు సాధింపు

దేవు—తొందరపడక తల్లీ. ఇహ నీ జోలికి రాకుండా చేస్తే సరిగా (నిష్క్రమించును)

శక్తి—ఈ వృద్ధుకు పట్టి వెఱ్ఱిదేవుడు. ఇతనిమాటలే విని, యింత ఘోరనరకం. అనుభవిస్తున్నా. అసలు ఈ కొంపలో ఇంత ముసలపీనుగలవల్లనే సుఖం లేకుండాపోయింది. వీళ్లకి మురుగుడుపురాణాలుతప్ప యింకోటి మరేపీ రుచించవు.

ఉ. ఈ సుకుమార సుందర మహీమహిళామణి కాపురమ్ము స
న్యాసమతాలతో ముఱిగి నవ్యయుగోదయ దివ్యజీవనో
ల్లాసము లేక జీవములు లాగెడి యింత దురంతచింతతో
వేసవిపోలె మండుటకు వృద్ధులబుద్ధులు కాదె? హేతువుల్.

దురాగ్రహి ప్రవేశము

దురా—ఏమిటోయ్ చాలా విసుక్కుంటున్నావ్?

శక్తి—విసుక్కుటమేగాదు, ఇంకా ఇటువంటి కోపంలో ఒక్కనిమిష ముంటే గొంతు పిసుక్కుటంగూడా జరుగుతుంది. (చేతిలోవున్న ఉత్తరం చాటుగా రొండిలో దాచుకొనును)

దురా—(ఆదుర్దాగా) ఏమి టది?

శక్తి—ఏమిటీ లేదుగానండి, ఒక్క నిమిషం నే నిక్కడుండ లేను. ఇంకా ఎక్కడైనా వుందాం పదండి.

దురా—మళ్ళీ ఇనాళ్లగూడా అత్తాకోడళ్ళు కుస్తీ పట్టారా?

శక్తి—లేనిపోని పెత్తుకొని మీంద పడుతుంటే కుస్తీలు పట్టకుండా యెట్లా వుంటారు?

దురా—(నవ్వి) ఇవాళ్ళ అత్తగారే దీక్షనేసి పంచెం కొట్టినట్లు తోస్తున్నదే?

శక్తి—పోదుర్దూ పాడు సరసాలు. ఒక చెంపన ప్రాణాలు పోతుంటే.

దురా—అంత ప్రమాదమైన దెబ్బలు తగిలేవరకూ నీవుమట్టుకు ఎందుకు పోట్లాడాలి? (దగ్గరకు వచ్చి) అబ్బా! అసలు ఇన్ని కనపడని గాయా లెట్లాపడ్డే? మందేమన్నా తెస్తా.

శక్తి—మనస్సుకు పడ్డ గాయానికి మందులూ లేవు మాకలూ లేవు; మనస్సుకి నచ్చిన చోటుండాలిగాని నొచ్చిన చోటుండగూడదు.

దురా—ముమ్మాటికీ వుండగూడదు. అసలు-

మ. ఎలనవ్వుల్ తొణకించుచున్న నవహేలాలతాతన్వి యీ
ఫలవంతంబగు పాదునుంచి మఱియే పందిళ్లకున్ బ్రాకునో
మొలకెత్తెన్ మృదుమాధురీస్రుతులు నోముల్ పంటకై యింక
స్వామలు వెన్వెంటను దిర్గుచుండవలెఁగాఁబోలున్ గళాశోభినీ!

శక్తి—చాల్లేదురు మీ సరసాలు ఒళ్లు రవరవా మండుకుపోతున్నది.

సత్యాగ్రహి ప్రవేశం

సత్యా—అన్నయ్యా!

దురా—ఏమిటోయ్ సత్యాగ్రహీ?

సత్యా—మనవాళ్ళగతి విన్నావా?

దురా—ఏమిటి?

శక్తి—మనవాళ్ళెవరయ్యా?

సత్యా—మా పినతండ్రిగారైన పృధ్వీపతిగారిగతి?

దుగా—ఏమైంది?

సత్యా—చాలా పెద్ద రగడలోనే పడ్డాడు.

దురా—ఏం జరిగింది?

సత్యా—కొండవిరిగి మీద పడింది

గీ. భారతక్షేత్ర సంగ్రహవాంఛ జేసి
కౌరవకులంబు సకలంబు కాలిపోదె
పాపకర్మంబు జేసెడి భూపజాతి
కిప్పుడైనను ఆవాత్రిత తప్పు టెట్లు?

దురా—ఎవరూ? ఏంముప్పు తెచ్చిపెట్టారు?

సత్యా—ఎవరా! ఆకలిమంటల్లో మలమల మాడుతున్న ప్రజలు.

దురా—ఏం చేశారు?

సత్యా—సమ్మె చేశారు.

శక్తి—ఇంతేకదా ప్రజలసమ్మెకి ప్రళయాలేవీ రావులెండి.

దురా—అట్లా అనక. ప్రజల సమ్మెవల్లనే ప్రళయాలు వచ్చేది. మంచితరుణం వచ్చింది. మేము చిన్నవాళ్లమై యుండగా నట్టి అమాయకుడైన మా తండ్రిని మోసగించి రాజ్యాన్ని పొట్ట పెట్టుకొని కులుకుతున్నవాళ్లింకా యెక్కడికి పోతారో చెబుతా.

సత్యా—అన్నయ్యా! మనం ఇప్పుడు తొందరపడ గూడదు. మనం కేవలం అన్నివిధాలా నలిగివున్నాం. ఇప్పుడు సమ్మెచేస్తున్న ప్రజకి మనకి తోచినట్లు మనం తోడుపడదాం.

ప్రజానాయకుడైన హాలాహలంగారికి సలహా యిచ్చి దారి చూపుదాం.

శక్తి—ఇహ మీ బాబాయిగార్కే సలహా లిచ్చేవారు లేరన్నమాట.

దురా—లేకేం ఉన్నారు (నవ్వి) వారికి సలహాదార్లు కలవా?

సీ. వాకిట నిలుచుండి తోకలాడించెడి
స్వాములు వెనువెంట జనుట లేదె?
మాటమాటకుఁ దోడుపాటపాడెడి పెద్ద
భజనపరులు వెంట బడుట లేదె?
దూరి తుపాకిలో దూకులు దూకెడి
తోటాలు పేలి బాదుటలు లేదె?
లేవిడి గానట్టి దేవిడిఁ జూచెడి
బ్రాహ్మణాక్షతలు పైఁబడుట లేదె?
ఇందులో ఏవి కలవయ్యో? ఈ దొరలకు
ఇంతకంటె కావలసిన వేమి టింక?
హాడలుకొట్టి యీలాటి సైన్యాలు పెట్టి
బక్కవారిని బలి గోరఁబడుట లేదె?

సత్యా—బాగా చెప్పావు. ఇన్నిహంగు లున్నైయని ప్రజల్ని పీడించుకొని తింటున్నవారికి సలహాదార్లు లేకపోతే యెట్లామటి? కానీ ప్రజ లంతా ఒక తాడు పట్టుకొని నడిచి నప్పుడుగాని వీళ్ళతిప్పలూ గొప్పలూ బయటపడక మానవు.

శక్తి—పూట గడవక నానాఅవస్థలూ పడి గోలపెడు తున్న యీ ప్రజలు అలిగికూర్చుంటే ప్రభువులకు వచ్చిపడే

కష్టాలేమీ లేవు. అటువంటి అగచాట్లమారి ప్రజల్ని నమ్ముకొని కూర్చుంటే మనవాళ్ళో వచ్చిపడే అదృష్టాలేమీ లేవు.

సత్యా—ఆడవాళ్ల కింతకంటే మిచ్చేం తెలియవు.

శక్తి—పౌరుషంలేని మగవాళ్ల కింతకంటే ఇంకేం తెలియవు.

దురా—అనవసరంగా మాట్లాడక.

శక్తి—అనవసరమేమీగాదు. ఇదీ అవసరమైనదే.

సత్యా—అయితే నీకళ్లకి పౌరుషంగలవా రెవరు?

శక్తి—ఎవరా! పరాధీనులు గానివారు.

సత్యా—ఇంతేనన్నమాట నీకు తెలిసింది?

దురా—వాళ్లమొహం వాళ్ల కింతకంటే తెలిసిచచ్చిందేముంది?

శక్తి—అవును (నవ్వుచు) మనకీ అంతే.

సత్యా—నవ్వీన నాపచేనే పండింది.

దురా— వాళ్ళమొహం వాళ్ళకేం తెల్సుగాని, డాక్టరు ప్రజలపక్షమా? బాబాయిగారి పక్షమా?

సత్యా—అదే తెలియటంలే దింకా. డాక్టరికీ నీకూ చాలా దోస్తీవుందికాబట్టి, అయినా నీవు కదలించి చూడు

శక్తి—(నవ్వి) పరాధీను లంటే అర్థం ఇదిగో ఇదే

సత్యా--ఆహా! ఎట్లాగైతేనేం అర్థం తీశావుగూలావు.

దురా—వాళ్లతో మాట్లాడక. సరే డాక్టరుగారిదగ్గఱకెళ్ళి కదలిస్తా. హాలాహలం దగ్గఱికి వెళ్ళిసమాచారం లేమిటో నీవు తెల్సుకురా. వెళదామా?

సత్యా—పదా మఱి. (నిష్క్రమింతురు)

శక్తి—(నవ్వి) వీళ్ల కేముందని వీళ్ల మొహం చూస్తాడు డాక్టర్? మొత్తానికి బలేజోడా కుదిరింది. పేర్లకు దగ్గవార్లైనారు. ఎందులోనూ ఒక రాకరికి తీసిపోరు. అయినా ఈ సత్యాగ్రహి ఏంచూచుకొని యింత మిడిసిపడుతున్నాడో చూడాలి. పూటకు గతిలేనివాళ్లని తీసికొని వీళ్ళేమో. సంస్థానంమీద దండెత్తుతారట. ఇంట్లో ముసలవాళ్ళపోరూ, బయట ఈ బడాయికోర్ల పోరూ ఇట్లా శ్రుతిమించి రాగాన పడితేగాని కథ రక్తికట్టదు. (పిల్పు విని) ఎవరూ!... వస్తున్నా (నిష్క్రమించి)

(తెర పడును.)



# ఆకలి మంట



## ద్వితీయాంకము

1వ రంగము—డాక్టరిల్లు.

కీర్తన పాడుకొంటూ ప్రజలతో హాలాహలం ప్రవేశం

చూడరా రాణాలు
త్రోడెరా ప్రాణాలు
హాయిగా సిరు లన్ని మేయగా దొర లెల్ల
మాయగా కథ లెన్నొ వ్రాయగా కవు లెల్ల ॥చూ॥

మానవీగాయాలు
గానవే న్యాయాలు
దైవమే లేడేమొ గావగా రాదేమొ
నీటుగా వినడేమి చాటుగా తినడేమి ॥చూ॥

దూరముగా మాలా ప్రవేశం.

మాలా—హరే హేమ్లిమాకోయ్ ఫాదూగోలా.

హోలా—(మళ్లీ కీర్తన చెబుతుంటాడు—చూడరాదాణాలు)

మాలా—హరే నీకీగాదుబే సెప్పేది? సైతానల్లే తగులొక్కున్నావ్.

హోలా—మేము సైతానులమూగాము, సాతానుల మూగాము.

మాలా—ఖాఖాఫోతే సుల్తాన్లూబే మీకీ?

హోలా—మేము ఏతానులంగాము.

మాలా—కాఖాపోతే కాఖాపోయార్గానీ హిక్డా గడి బిడా నఖో

హోలా... డాక్టరుగా రున్నారా సాహెబుగారు?

మాలా—హరే! నీకీ డాక్టర్ సాబ్ కైకూరే? ఏగానా నైసునా: జావో

హోలా—అట్లాగంటే మేమెట్లా బ్రతకాలి?

మాలా—హిట్లా హెవణ్ణీపడితే వాణ్ణీ రానిత్తుంటే మేం హెట్లా బతకాలి? డాక్టర్ సాబ్ ఘర్మే నై.

హోలా—ఎక్కడికెళ్ళారో చెబుదురూ కాస్త.

మాలా—హా రే! నీకీ ఆరామం తా ఎంధుకూ ఛే?

హాలా—కోపగించకి చెబుదురూ కాస్త.

మాలా—హా రే నీకీ మన్నీజన్మం హెత్తా లేదు ఛే? డాక్టర్ సాబ్ దివాణంకీ జాతేహై. జావో జావో (నిష్క్రి)

హాలా---(మళ్ళీ కీర్తన చెబుతాడు - చూడ రాతాణాలు తోడెరా పాణాలు) నావిశ్వజన సహోదరులారా! చూస్తిరా న్యాయాన్ని? యెందుకైనా న్యాయం లేకుండా పోయింది. ప్రతి వాడికీ తన పొట్టా తన పెట్టా నింపుకోటం పట్టినప్పా డింకా యీ దిక్కుమాలిన మొఱ లెట్లా వినపడతై? దయా దాక్షిణ్యాలు కనపడతై? అదృష్టాల్నీ, అష్టైశ్వర్యాల్నీ అందఱికీ అందే అందుబాటులోకి తెచ్చుకొన్నప్పుడే యీ అగచాట్లు పోతై, యీ ఆకలిమంటలు చల్లారుతై. అందాకా ఎంతెంత మహాత్ములు దిగివచ్చినా ప్రయోజనం లేదు. ఎన్ని అవతారా లెత్తినా ప్రయోజనం కనిపించదు. అమృతహస్తుడై పరోపకార పారీణుడై యింత పేరు గడించిన యీ డాక్టర్ గారి దర్శనంగూడా దుర్లభమైంది. వీరి కాంపౌండర్లకు, వీరి జబర్దస్తీ నౌకర్లకు ఎంత పెద్ద రాజసం, ఎంత మహాతామసం బలిసిపోయిందో చూడండి. డబ్బులేనివాళ్ళమనీ, డాబుచేయు లేని వాళ్ళమనీ ఎంత చులకనగా, ఎంత నిర్లక్ష్యంగా చూస్తున్నారో చూచుకోండి. నా విశ్వజన కష్టజీవులారా! అసలు దీని కంతటికీ కారణం మన అమాయకత్వం, మన అజ్ఞాన మతమూర్ఖత్వం ఈ రెండూం ఏకమై మనకళ్ళు మూసి మన శరీరకష్టాన్ని తెలివిగలవాళ్ల కలాలకీ, తెలివిగలవాళ్ల త్రాసు

లకీ, భారాగతం చేస్తున్నమూలాన యిటువంటి ఘోరకార
ణాలు ప్రాప్తిస్తున్నై. ఇంత నీచాతినీచంగా మాడబడు
తున్నాం.

ఉ. దిక్కులకెక్కుచుండెడి అదృష్టము తెక్కులకష్టముల్ బ్రజా
దృక్కులు తిన్నగాఁగనెడి దివ్యయుగంబది యెప్డు వచ్చునో
ఇక్కడివారి చూపులకు నెక్కుము చక్కగ నంతదాక; ఈ
ఫక్కిగ నేఁడు మాడవలె భగ్గునమండెడి కాలుచిచ్చులోఁ.

కోపంతో మాలా ప్రవేశం

మాలా—హ్యారే మీకీకౌనుబే పాండీహానీ సెప్పింది?

హాలా—డాక్టర్ గారికోసం వచ్చాం.

మాలా—డాక్టర్ మీకోసం సిద్ధంగా నై బైట్నా
ఇదర్, ఛలో.

హాలా—డాక్టర్ గారితో మాట్లాడి వెళ్ళుతాం.

మాలా—తేరగా మీకీ ధాధాఘాడీముల్లె హేమ్లా
హుందీరే డాక్టర్ గార్కి హారొచ్చి మీతో మాట్లాడటానీక్కి?

కోలాహాలరు ప్రవేశం

కోలా—ఏం మాలాసాహెబ్ గారు! డాక్టర్ గా
రున్నారా?

మాలా—(వినయంగా) సలాం ధయ్ సేయండయ్యా!
డాక్టర్‌సాబ్ అభీ ఆవూంగ (కుర్చీ తెచ్చి వేయును)

కోలా—(కూర్చుని) వీ ళ్ళంతా ఎవరు?

మాలా—నాకీ మాలుంనై బాబ్! హేడాదో ముష్టి
మూకా ఖామల్లు వచ్చీపడ్డార్.

కోలా—ఎందు కిట్లా యీ గుంపుని జొరబడనిస్తావు?

హాలా—చిత్తం వారు తెలియక జొరబడనిచ్చారు. మీరు వెళ్ళగొట్టండి.

కోలా—వీ రెవరు?

హాలా—వీ రండి?

గీ. వీరు మీ కేమి తెలియనివారు కారు
నెత్తు రోడ్చి కండలు కోసి పత్తు లేడ్చి
ఈ బొమికలతోఁ గోటల నెల్ల గట్టి
వీరు కోలాహాలము బలిపించువారు.

మాలా—చుప్ రహో! నీకీ హొచ్చినవనీ హేమ్టి? హిఫ్డూ నీకీ కూసేదీ హేమ్టి?

(డాక్టర్—దురాగ్రహి ప్రవేశం)

డాక్ట—ఏమిటి సాహెబూ కోప్పడుతున్నావ్?

హాలా—నమస్కారాలు డాక్టరుగారు!

డాక్ట—ఆ కూర్చోండి వస్తా. ఒహో! కోలాహాలం గారు ఎప్పుడు వచ్చారు?

కోలా—నేనువచ్చి చాలాసేపైందిలెండి. ఇవాళేమిటో చాలా హడావిడిలో వున్నట్టున్నారు?

డాక్ట—మీ దొరలూ, మీరూ, తెచ్చిపెట్టిన హడావుడే.

కోలా—దొరలు చాలా ఉదారులండి, మీకు తెలియని దేముంది?

డాక్ట—అవుననుకోండి. అయితే ఇంతగో లెందుకు లేవాలి?

(అంతా కుర్చీల్లో కూర్చుంటారు, మాలా పానీయాలు తెచ్చి పెడతాడు. హాలాహాలం పరిజనులతో పక్కన నిలబడి చూస్తుంటాడు.)

దురా—కోలాహలంగారు పుచ్చుకోరేం?

కోలా—నాకింకా దేవతార్చన వుందలెండి. పెద్దవాళ్ళమైవుండి దేవుడి నివేదన కాందే పుచ్చుకొంటే ఎట్లా నాయన?

డాక్ట—దేవుడెక్కడో లేడు. మనందరి నివేదనలకోసం మనలోనే దాక్కున్నాడు. పుచ్చుకోండి.

కోలా—అవుననుకోండి దానికి మడీ మైలా అఖ్ఖర్లేక పోతె బాగుంటుందా మరి?

దురా—ఈ విషయంలో డాక్టరుగారు! మీరుమట్టుకు యేమాత్రం సందివ్వరాదు.

డాక్ట—ఇవ్వరాదు లెండి. ఇప్పుడు నాపని కత్తీ నాగలి మధ్య పడ్డట్టైంది.

దురా--ఏమైనాగానీండి. అన్నింటికంటే పరువుగొప్పది.

డాక్ట—అవును మరి.

హాలా—అయ్యా! డాక్టరుగారు!

మాలా—హారే! హెమ్బ్రావోయ్! సెప్తుంటే బుద్ధిలేదా నీకీ?

డాక్ట—ఏమిటయ్యా! మీ సంగతి?

హాలా—పేదవాళ్ళం, బొత్తిగా రెక్కలకష్టంమీద జీవించేవాళ్లం. మామొఱ దయువుంచి ఆలకించాలి.

కోలా—సరే పార్థ నింకా ముగించి, అస లేమిటో చెప్పు.

హాలా—కటాక్షించాలి. దౌర్లబంటో రోతులు వచ్చి యీ కష్టజీవాల్ని చావకొట్టారు. అయ్యా! డాక్టరుగారు! కాస్త ప్రాణదానంచేసి పుణ్యం కట్టుకోండి.

కోలా—ఓసి ఇంతేకదా. అట్లా ఆసుపత్రిలోకి పొండి కట్లు కడతారు.

మాలా—హరే! దాన్కి నాకీ సెప్పి హేడ్వారాదు జే! ఆవురే ఆవ్ (మాలా నిష్క్రమించు)

దురా—మై డియర్ డాక్టర్! సెలవ? (లేచును)

డాక్ట—(లేచి) వెళ్తారా? మళ్ళీ ఎప్పుడు దర్శనం?

దురా—(నడుస్తూ) రేపు వస్తాలెండి. చెప్పిందిమట్టుకు జ్ఞాపక ముంచుకోండి.

డాక్ట—(కూడా వెళ్ళి) చిత్తం (దురాగ్రహి నిష్క్రమి)

కోలా—ఈ దురాగ్రహిగారు వారి వంశంలోకల్లా చాలా తెలివైనవారు.

డాక్ట—(కూర్చుని) తెలివైనవారే, ఏం ప్రయోజనం? పాపం ఆ తెలివికెడగ్గ ఎస్టేటుగూడా వున్నట్లయితే రాణించే వారు.

కోలా—ఇప్పుడుమట్టు కేమండి. అన్నవస్త్రాల కేం లోటు లేదు. బోలెడంత ఆస్తి వుంది.

డాక్ట—అదేమిటండి అట్లాచెబుతారు? ఎస్టేటిప్పు డెవరికింద వుంది?

కోలా—ఎస్టేట్లు ఏలే వ్రాతవుంటే వీళ్లకిందే వుండేది.

డాక్ట—అదేమిట్లెండి. అమాయక దేవుణ్ణి మాయచేసి ఎస్టేటు లాక్కున్నారని పుకారు పుట్టింది. నిప్పు లేందే పొగ యెట్లా వస్తుంది?

హాలా—అయ్యా! డాక్టర్ గారు! మమ్మల్ని పంపించాలి.

డాక్ట—ఏమిటా్రి మీగొడవ? కట్లు కట్టించుకోండి. మాలా! మాలా! వీళ్ళని పంపించవోయ్!

మాలా ప్రవేశం

మాలా—క్యా జీ!

డాక్ట—వాళ్లసంగ తేమిటో చూచి పంపవోయ్!

మాలా—హరే మీకీ హింకా హిక్డా హుంటే మంధూ హెవడూ హేత్తాడోయ్? ఆస్పత్రిలోకీ రండి.

హాలా—అయ్యా! సర్టిఫికెట్టు గూడా దయచేయించాలి.

మాలా ... హరే! సర్టిఫిట్టు నేనూ హిత్తాను రండోయ్ ఘూడవా.

డాక్ల—ఇప్పుడుకాదు వెళ్లండి.

(శక్తికాంత ప్రవేశం)

శక్తి—హలో మై డియ్యర్ డాక్టర్!

డాక్ట—(లేచి) హలో హలో గుడ్‌మార్నింగ్. దయ చేయండి.

శోలా—వీ రెవరో మఱచిపోయినా.

డాక్ట—వీరు దురాగ్రహిగారి వైఫ్ శక్తికాంతగారు.

కోలా—అట్లాగా! వీరేకాదూ బియ్యే ప్యాసైనారట?

డాక్ట—అవునండి.

కోలా—అయితే నాకు సెలవిప్పించరూ? ఇంకా దివాణానికి వెళ్ళిరావాలిగూడా

డాక్ట—పోదురుగాన్లెండి కూర్చోండి.

కోలా—ఇంకా ఈముూక ఇక్కడే వుంది యెందుకు? పోండా్రి అబ్బి! పోయి కట్లు కట్టించుకోండి.

హాలా—నెళతాంలెండి బాబు! అయ్యో! డాక్టరుగారు స్టిఫికెట్టుగూడా దయచేయించండి. వెళ్లవస్తాం.

డాక్ట—ఏమిటోయ్! అస్తమానం ఓూగొడవేనా మాకు? ఇప్పుడు వల్లకాదు పొండి.

మాలా—హరే మీంకీ కామూచే సెప్పేది? రండి.

హాలా—అయ్యో డాక్టరుగారు! పేదవాళ్ళం, కనికరించాలి. నమస్కారాలు. (నిష్క్రిమిస్తారు)

కోలా—ఆరి పోండా్రిఅబ్బి పొండి, ఆటే విసిగించక.

డాక్ట—చచ్చిపోతున్నానండి. ఈ అనవసరమైన పేషెంట్లతో

కోలా—కాదుటండి. వీళ్ళవల్ల కాసీ వచ్చేదుందా? చచ్చేదుందా? అయితే నాకు సెలవివ్వాలి. నాదొక మనవి గూడా వినాలి.

డాక్ట—అయ్యో అంతకంటేనా! ఇందాకణ్ణుంచీ చెప్పరుకాదేం?

కోలా—ఏదీ యీ దిక్కుమాలినమూక చెప్పనిస్తేగా? మరి నిన్న ఈ అల్లరిమూక నామీద కలేబడి కొట్టినట్లూ, చాలా బలమైన దెబ్బలు తగిలినట్లూ, మీ ఆస్పత్రికి వెంటనే

చేర్చినట్లూ, సర్టిఫికెట్టివ్వాలి. దాన్నిప్పుడు దివాణానికి తీసి కొనిపోయి ధొరగారిద్వారా చార్జి యిప్పించాలి.

డాక్ట—(సిగిరెట్టు ముట్టించి) అట్లాగేనండి (కాగితం తీసి వ్రాస్తూవుండును)

శక్తి—విన్న మాకు కనిపించారుకదండి. ఇంతలో ఇంతఘోరం ఎప్పుడు జరిగిందండీ పాపం?

కోలా—అన్నట్టు నిన్న మీ యింటిమీదగా పోతు న్నప్పుడు మీరుగూడా చూచేవున్నారుగా. అప్పుడే జరిగింది యీ ఘోరంతల్లీ!

డాక్ట—ఇదిగోనండి. ఈ కవరులో వుంది. అంతా మీరు కోరినట్లుగానే వ్రాశాను. (ఇచ్చును)

కోలా—మహాప్రసాదం (కళ్ళ కద్దుకొనును) మీ రీసాయంత్రం ఒకదఫా తప్పకుండావచ్చి దివాణంలో కన పడాలి. చాలా అవసరమండోయ్. మళ్ళీ మఱచిపోతారేమొ. మీ పనికే రమ్మంటున్నది ఇహ నాకు సెలవు (లేచిపోతుం డును)

డాక్ట—(కూడావెళ్ళి) చిత్తం కోలాహలంగారు నే నుంటా.

కోలా—(తిరిగి చూచి) మంచిది వుండండి. అయితే డాక్టరుగారు! అడగవలసిందసలు అడక్కుండానే వెళుతున్నా.

డాక్ట—ఏమి టండీ బాబు?

కోలా—ఏమిటా! ఈ పెట్టపోతున్న కేసులో మీరు మాతరపున సాక్షులుగా ఉండాలి. తప్పకుండా సాక్ష్యం ఇవ్వాలి.

డాక్టర్—దాని కేమిలెండి. మళ్ళీ తమ ఆజ్ఞ జవదాటడం కూడానా. అవశ్యం చెబుతానండి.

కోలా—ఇదే చెప్పడం మఱచిపోయినా. ఇహ మీరుండండి పాపం. (నిష్క్రమించును)

శక్తి—ఎంత వేధించుకుతిన్నాడండి!

డాక్టర్—అమ్మా! వేధించుకుతినట మేమిటి. తనపని అయ్యేవఱకూ యెన్ని యెత్తులూ జిత్తులూ పన్నుతాడనుకోంటారు. చెప్పలేం ఊపి రాడనియడు. చంపుకొనితింటాడు, ఫక్కా కిలాడితనం వుందిలెండి. దివాణంలో అధికారంఅంతా వీడిదే.

శక్తి—మొత్తానికి చాలా అసాధ్యుడు. యుగంధరుడు.

డాక్టర్—నిజంగా యుగంధరుడే.

శక్తి—మీ ఫామిలీని యింకా తీసుకు రాలేదేం?

డాక్టర్—ఇంకా రెండునెలల్దాకా రారు లెండి.

శక్తి—అయితే! నిన్న లెటర్లో పాపం మీరు చాలా చిక్కినట్లు కనిపించా రెందుకు?

డాక్టర్—(నవ్వి) ఎందుకో నీకు తెలియం దేమిటి?

గీ. ఈ మనోహర కాంతార సీమలోన
జీవనాధారమైన సరోవరమ్ము
కనపడక తిర్గి తిరిగి చిక్కినది సుమ్మి
రసతరంగిణీ! నీ దివ్యరాజహంస.

శక్తి—(నవ్వి) అయితే! ఇంతలో ఏంటానిక్కు పుచ్చుకొని యిట్లా దారి కొచ్చారు?

డాక్టర్—(నవ్వి) అది నీకు తెలియంది కాదుగా.

గీ. వట్టి బొమ్మికల పోగైనవాఁడుగూడ
సుందర కళాలతాతన్వి చూపు తగిలి
ఇంత యేనుగుపుష్టి బట్టించుకొనియె
సుదతి! యేమి కలదొ యింతిచూపులోన.

శక్తి—ఈ మదపుటేనుగులవల్ల కాబోలు (నవ్వి)

గీ. ఇంత దివ్యసరస్సుల కెప్పు డింత
పెద్ద కల్లోలములు పుట్టి ప్రియతరమగు
ఈ మృణాలమ్ము లబలలై యిట్లు వడెను
ఇంగితజ్ఞాన మేది మత్తేభములకు?

డాక్ట—చాలా ధ్వనిగలమాట యిది. నిజంగా నీరజాక్షులూ, మృణాలగాత్రులూ కల్యాలిట్లా వాలికిస్తుంటే, మగవాళ్ళు మత్తేభాలుగాక పలక బలపాలౌతారా మఱి? పాపం! ఈ మదపుటేన్గులవల్ల యింకా చాలా నలిగి ఆయాస పడవలసి వస్తుంది. కొంచెం ఈ పానీయం విశ్రింప చేయండి. (అందిచ్చు)

శక్తి—మే మేమీ దీనికి వాచిపోలేదు.

డాక్ట—మీరు వాచిపోకపోతే మేము పాచిపోవలసి వస్తుంది.

శక్తి—అప్పుడు మళ్ళీ గరమ్ చేసుకొంటాం.

డాక్ట—అన్నింటికీ మీరు సమర్థులు. పుచ్చుకోండి.

శక్తి—ఏం పుచ్చుకోవాలి?

డాక్ట—మధురమధురమైంది.

శక్తి—అయితే నాకు మధురమైందిది కాదే.

డాక్టర్—అదీ వస్తుంది.

శక్తి—అదంటే?

డాక్టర్—ఒళ్లూపైనా తెలియందీ.

శక్తి—మత్తా? అమ్మో! అయితే నా కొద్దు.

డాక్టర్—నా కొద్దూ. గటగటా మింగండి.

(అం దివ్వవచ్చును)

శక్తి—చాలేండి కవిత్వం. ఏమిటీ వద్దంటే.

డాక్టర్—ఇంత మధురమైంది వద్దంటే, యింకా మీకు రుచించే దేది?

శక్తి—మీకు తెలుసు.

డాక్టర్—అవునూ. అదీ కాదంటే?

శక్తి—ఎందు క్కాదంటారు చెబితే?

డాక్టర్—(నవ్వి) పేరేమేనా?

శక్తి—(నవ్వి) ఆహా అయితే బాగా తెలిసిందన్న మాటే.

డాక్టర్—అబ్బా! ఏమిటీ? ఇది పుచ్చుకోండి చెబుతాను.

శక్తి—అబ్బా! ఏమి టిది, చెప్పండి? పుచ్చుకొంటూ మణి.

డాక్టర్—ఏమిటా చెబుతున్నా విను.

ఉ. ఎన్ని సుధారసమ్ములు మహీస్థలి నుండిన నేమి! వాటిలో
అన్నిటికంటె తియ్యనిది యాదపుచిన్నది; దానికంటె పే
రున్నది తియ్యతియ్యనిది; ఊహలో అంతకుమించినట్టి దే
మున్నదియుంటె! లొంగని మహోజ్జ్వలచంచల సుమ్మి కోమలీ.

శక్తి—చెప్ప లేరు, దానికి ఇన్ని మాట లెందుకు?

డాక్ట—అయింది. ఇదీకాదూ? అయితే నన్ను క్షమించాలి.

శక్తి—ఇహ మీరు చాలించాలి.

డాక్ట—ఏమిటి?

శక్తి—వాదం.

డాక్ట—ప్రసాద మిస్తే వాద మెందుకు? చెప్పాలి త్వరగా.

శక్తి—చెబుతాగాని నే నివ్వమన్న దిస్తారా?

డాక్ట—ఇంకా అందుకు సందేహమా? సర్వస్వమూ ధారాగతం చేస్తాను. పుచ్చుకోండి మరి.

శక్తి—చెప్పి పుచ్చుకొంటా.

డాక్ట—కానియ్యండి.

శక్తి—ఆడదానికోరిక తెలిసిందా (పుచ్చుకొని పానీయం త్రాగును.)

డాక్ట—అబ్బా నిజమే యిది. ఆడదానికోరిక యెంత తీపోగాని మరి ఆతీపితో ప్రాణా లెట్లా కోస్తున్నదో చూడండి.

శక్తి—సరేగాని, మై డియర్ డాక్టర్! ఇవ్వమన్న దానిసంగతి ఏమిటి?

డాక్ట—ఏమిటో అది చెప్పండి.

శక్తి—అభయం.

డాక్ట—(నవ్వి) ఇంతదానికి సాహసించినవారిగ్గూడా భయమేనా?

శక్తి—అది కాదు. ప్రామిస్ చేయమంటున్నా.

డాక్ట—దేన్నిగూర్చి?

శక్తి—ఇప్పుడు వచ్చిపడ్డ తగాదాగుఱించి.

డాక్ట—దానిజోలి మీ కెందుకు?

శక్తి—తెలివితక్కువలో పడకుండా వుంటానికి.

డాక్ట—ఎవడి తెలివివల్ల తెలివితక్కువలో పడేది?

శక్తి—దైవమూ, ధర్మమూ, సహాయమైనవాని తెలివివల్ల.

డాక్ట--(నవ్వి) కానరాని దైవాన్నీ, లేనిపోని ధర్మాన్నీ పట్టుకొన్నవా డెవడూ?

శక్తి—ఎవడా! జగన్మాతకి ముద్దుబిడ్డడైన సత్యాగ్రహి.

డాక్ట—ఓస్ అతడేనా? ఫలివాలా.

శక్తి—ఇట్లా తృణీకరించి కూర్చుంటారనే చెబుతున్నది.

డాక్ట—అయితే ఏం చేస్తాడు?

శక్తి—ఏంచేస్తాడో వినండి. (నవ్వి) చూస్తారు

శా. ఏకైవల్యపదమ్ములో గనని
హాయిన్ గష్టజీవాలచే
మీ కోలాహలముల్ గడించి, కడు
కూర్మిన్ మిమ్ము గుల్కించెనో
ఆ కోలాహలపంక్తిపైన నదిగో
హాలాహలమ్మెత్తి ము
ల్లోకారాధ్యుఁడు వచ్చుచుండె
జయకల్లోలమ్ము మిన్ముట్టగాన్

డాక్ట—(ఆశ్చర్యంతో) ఇది నిజమేనా?

శక్తి—అవునో కాదో అదే తెలుస్తుంది. తొందరెందుకు?

డాక్టర్—ఇంతకుమునుపు మందుకోసం వచ్చిన హాలాహలాన్నేనా?

శక్తి—అవును.

డాక్టర్—చూచావా! ఎంత నక్కవినయంతో వచ్చి వెళ్ళాడో.

శక్తి—ఏమనుకొన్నారు మఱి. కార్యశూరుల శూరత్వం అట్లాగే ఉంటుంది.

డాక్టర్—ఇప్పు డేమీ మించిపోయింది లేదు.

శక్తి—అవును వాళ్ళకీ మించిపోయింది లేదు.

డాక్టర్—లేకేం బోలెడుంది. వీళ్ళకిప్పుడు ప్రాణప్రదమైన డాక్టర్ సర్టిఫికెట్టు కావాలి. దానికోసం వచ్చినప్పుడు వీళ్లంతు నేను కనుక్కొంటా.

శక్తి—మీరేం కనుక్కోలేరు. అందఱంతూ కనుక్కోడానికి జగదేకవీరుడైన సత్యాగ్రహి వాళ్ళండనున్నాడు.

డాక్టర్—సత్యాగ్రహి వాళ్ళమాటే చెవినిపెట్టుకోవటం లేదుటగా?

శక్తి...(నవ్వి) ఇదన్నిటికంటే బాగుంది. ఎవరు చెప్పారిది?

డాక్టర్—పరాయివా రెవరోకాదు చెప్పింది. మీ హాజ్బెండు దురాగ్రహి.

శక్తి—అయితే యింకేం బాగా నమ్మి కూర్చోండి.

డాక్టర్—నాకు తెలియక అడుగుతున్నా. అసలు వాళ్లన్నదమ్ములిద్దఱూ ప్రజాపక్షంలో వున్నారా?

శక్తి—సందేహం లేకుండా.

డాక్టర్—అయితే చాల్దూరగడలోకే దిగింది కథ. అయితే నన్నేం చేస్తారు?

శక్తి—కాళ్ళు పట్టిస్తారు.

డాక్టర్—ఎవరికాళ్లు?

శక్తి—ప్రజలకాళ్ళు.

డాక్టర్—ఈ జన్మలోగాదు. శతసహస్ర జన్మలకైనా వీళ్ల తరంగాదు.

శక్తి—అట్లాగా! మిమ్మల్ని పోషిస్తున్న ప్రభువులు అడవులపాలైతే అప్పుడు ప్రజలకాళ్ళు మీరే పట్టుకోవలసి వస్తుంది.

డాక్టర్—ఈ డాక్టర్ కంఠంలో ప్రాణం వున్నంత వరకూ నా ప్రభువులజోలికి ఆ ఫాలాక్షుడుగూడా రాలేడు.

శక్తి—ఇంతలో మీ ప్రాణంమీదకే వస్తే?

డాక్టర్—మీ చల్లని దయారసంతో జీవిస్తా జయిస్తా.

శక్తి—అందుకే నేను చెప్పేది. జాగ్రత్తగా వినమంటున్నాను.

డాక్టర్—అవశ్యం వింటాను. మీరు గీచినగీత దాటను. ఏమిటో చెప్పండి.

శక్తి—మీరు దురాగ్రహికి బాగా డ్రింకింగు అలవాటు చేయాలి.

డాక్టర్—ఫష్టో. అట్లాగే.

శక్తి—రెండవది సత్యాగ్రహికి వేదాంతపిచ్చి పుట్టించాలి.

డాక్ట—రైటో, బాగుంది. తర్వాత?

శక్తి—తర్వాత వాళ్ళె ప్రజలను తమ కాళ్ళదగ్గఱికి తీసుకొస్తారు, నేనుచెప్పిన యీ రెండువిషయాల్లో దేన్నీ విడిచి పెట్టకూడదు.

డాక్ట—ఈ నిమిషంలగాయతూ, ఈ సత్యాగ్రహి దురాగ్రహిలను నా అనుపమాన మహేంద్రజాల విద్యాచాతుర్యంతో కట్టేసి, వీరి ప్రతిభాప్రభావా లెటువంటివో చూస్తాను.

మ. సుమతీ! నీ సుకుమారసుందర కళాక్షోణీస్థలిన్ నీకటాక్షము ప్రాప్తించెడివేళ జంకునటె యే గండమ్ము డీకొన్న? ప్రాణముకంటెన్, మృదుమాధురీవిబుధ వీణాగానమై నీదు రాగము నాకెంతటిపుష్టి నిచ్చినదె? నీకారుణ్య మేపాటిదో.

శక్తి—దురాగ్రహి చాలా తెలివిగలవాఁడు. అతణ్ణి నిషాలో పడేస్తేగాని మనప్లాను సాగదు.

డాక్ట—అది ఇదివఱకే గ్రహించి ప్రాక్టీసిస్తున్నాను. చాలామట్టుకు తయారైనాఁడు.

శక్తి—ఎవరో పిలుస్తున్నా రల్లేవుంది వినండి.

డాక్ట—(వినిపించుకొని) మాలా, మాలా.

మాలా ప్రవేశం

మాలా—జీ. జీ. మీఖోసం దొర్గారికి ఖబుర్ నేశార్.

డాక్ట—మీ రిక్కడే వుండండి. దివాణానికి వెళ్ళి వస్తాను.

శక్తి—మీరు వెళ్ళిరండి. నే నింటికి వెళ్ళి మళ్ళీవస్తాను.
(లేచును)

డాక్ట—సాయంత్రం పెన్షన్ కోర్టుకు వెళదాం త్వరగా రండి.

శక్తి—సరే. వెళ్ళివస్తా (నిష్క్రమించు)

డాక్ట—మాలా! దొరగారిదగ్గ రెవ రెవ రున్నారు?

మాలా—కోలాహలంగార్ హైం జీ.

డాక్ట—సరే నేను వెళ్ళివస్తా. నీ విక్కడే వుండు.
(నిష్క్రమించు)

మాలా—సిత్తం (కూడా వెళ్ళును. తెరపడును)

2వ రంగం—దేవుడి సావిడి

దేవుడు - కోలాహలం ప్రవేశం

దేవు--ఏమిటి విశేషాలు కోలాహలంగారు? కూర్చోండి

కోలా—ఏమున్నై ఊళ్ళు మండుకుపోతున్నై.

దేవు—అ దేమిటి?

కోలా—మీ అబ్బాయిల మూలంగానే.

దేవు—ఏంచేశారు?

కోలా—తిరుగుబాటు లేవదీశారు,

దేవు—ఎవరిమీద?

కోలా— ఎవరోఏమిటి. మీ తమ్ముడుగారైన పృథ్వీపతిగారిమీద.

దేవు—ఎందుకు?

కోలా—పగసాధించుకొంటానికి, తిరిగి రాజ్యం సంపాదించుకొంటానికి.

దేవు—ఇప్పు డేంతక్కువైనవని రాజ్యాలు కావాల్సి వచ్చినై?

కోలా—అధికారాలూ, సింహాసనాలూ లేకపోయినవని.

దేవు—అరత్త వచ్చినప్పుడవే వస్తై. వాటికోసం ఇంత ఆగం ఎందుకు?

కోలా—ఆగమేమిటి వ్రూళ్లు తగలపెడుతున్నారు. చూచారా ఎట్లా నన్ను కొట్టించారో (వీపు చూపును)

దేవు—(చూచి) అయ్యోపాపం. వీళ్ళ కేంపోయేరోజులొచ్చి యిట్లా చావకొట్టారండి. అనుభవిస్తారెండి. ఇటువంటి వాళ్ళకి రాజ్యాలుకూడా కావాలి. ఎవ డదృష్టంకొద్దీ వాడు ప్రభువాతాడు, రాజ్యా లేలుతాడు. తమకు లేవని యీవరస అందర్నీ చావకొడుతుంటే రాజ్యా లొస్తాయా! ఇంటికి రానీయండి చెబుతా.

(తెరలోపల ప్రజల్తో హాలాహాలం కీర్తన పాడుతాడు)

కీర్తన—గాలిముహూరాలతో కంపించి పోవాలి
కూలికుటీరాలలో కాలాగ్ని పుట్టాలి
ఆకలీ మంటలూ
లోకముల్ కాల్చాలి
పోవురా పాపాలు
లేవురా పుణ్యాలు ॥గాలి॥

కోలా—(భయంతో) వింటున్నారా! ఆ పాటలూ పరితాపాలూ.

దేవు—(పట్టుకొని) ఫరవాలేదు కూర్చోండి.

కోలా—మీ శాంతవచనాలు వాళ్ళకేం రుచించవండోయ్. ఇంకా మీ తిరిసేతరిం తెలవాల్సిన ఘడియలొచ్చినై.

దేవు—రానీయండి. అదేమిటో చూచి చెబుతా.

కోలా—మీ రిప్పుడు మెత్తపడ్డారాఅంటెమట్టుకు మీ తమ్ముడుగారి కోటలూ వుండవు మీ గుళ్ళూ గోపురాలూ వుండవు. ఆలోచించుకోండి. వస్తున్నారు.

(కీర్తన పాడుకొంటూ హాలాహలం, ప్రజలు ప్రవేశింతురు)

హాలా—అయ్యా! ఆపదలో పడ్డవాళ్ళం ఆకలిమంటల్లో మలమల మాడిపోతున్నవాళ్ళం. భగవంతుడవనీ పేదలమొర వినగల దేవుడవనీ వచ్చాం. మీ తమ్ముడుగారి కెందుకు రాజ్యం వొప్పచెప్పావయ్యా! దేవుడవైన నీకే మేము భారమైపోతే మావంటి మానవమాత్రులకు భారమైపోమా? నీవు నీ రాజ్యం తీసుకో, విశ్వమానవ ప్రేమ చూపుతున్న నీ బిడ్డల కిచ్చుకో. దైవమా! నీ తమ్ముడైన పృథ్వీపతికి దయ లేదు. ఆశ చావదు. రాజ్యం నిలవదు.

కోలా—సరేలే పాడుసోది. ఏదో మాట్లాడుకొంటున్నాం పొండి. రేపొచ్చి చెప్పుకోండి.

దేవు—నాయనా! మీకష్టాలు కనపడుతున్నై. కాలానికి కట్టుబడితేగాని మీ కష్టాలూ నాకష్టాలూ పోవు. ఓపిక పట్టాలి. అదృష్టం పట్టాలి. ఒక ఉపాయం చెబుతున్నా

వినండి. కష్టాలు తీరటానికి దేవతలకి మొక్కుకోవాలి. అడిగిన బలులు ఇవ్వాలి. తెలిసిందా? వెళ్ళి దేవతలకొల్పులు సాగించండి.

కోలా—అదీ చేయాల్సినపని. అట్లా పోలేరమ్మ జాతరలు చేస్తే పొలిమేరలోవున్న కష్టాలన్నీ అయిపు లేకుండా పోతై. పొండి. పోయి అట్లా నడవండి. అగచాట్లూపోతై ఆకలిమంటలూ చల్లారతై.

హాలా--దైవమా! దేవుడవని పేరు పెట్టుకొని దీనుడవై మాట్లాడావు. ఇంకా నీ కెందు కిన్ని బిరుదులు? కంటబడ్డ కష్టజీవాల కష్టాలు తీర్చలేనప్పుడు నీవెట్లా దేవుడవాతావయ్యా? నీవు దేవుడవు కావు. నీవు చేతగాని దేవయ్యవు. నీవే దేవుడవైనట్లైతే నీయిల్లు నిత్యకల్యాణాల్తో పచ్చనితోరణాల్తోవుండేది. ఈ పాపిష్టి ప్రపంచంలో సాటిమానవుల మెడలు విఱచి వెచ్చని వేడినెత్తురు పీల్చి కండలు తిని, బొమికలు పగుల కొట్టుకొని సువర్ణసౌధాలు కట్టుకొని సుఖభోగలాలసులై కూర్చున్న సోమరు లంతా యేమీ చేతగాని నిన్ను నిలబెట్టి గుళ్ళుకట్టి నీ పేరు చెప్పి యీ అమాయక కష్టజీవాల్ని బెదరకొడుతున్నారు. ఇవాళ్ళతో నీసత్తా తెలిసింది. నీ పూజారి ముఠా నాటకం బయటపడ్డది. దైవమా! ఇంకా నీవూ నీ భజనపర్లూ ఎట్లా మాయనాటకం ఆడగలరో చూస్తా.

గీ. కష్టజీవాల కడుపులు కాలికాలి
మండి మారణమైన బ్రహ్మాండమందు

నిన్ను తలంచెడివాడె లేకున్నగాని
నీకు తెలియదు దేవుడా! నీదు బ్రదుకు.

(కీర్తన పాడుకొంటూ పోదురు)

కోలా—ఈ పోకిరీగుంపు ఎవరికొంపమీద పడు తుందో. పోయివస్తా స్వామి (నిష్క్రమించు)

దేవు—జాగ్రత్తపడితేగాని ఇహ వీలు లేదు. (నిష్క్ర)

(తెరపడును.)

# ఆకలిమంట

## తృతీయాంకము

### 1వ రంగము—దివాణం.

(తీవ్రదృష్టితో చిటమటలాడుతూ పృధ్వీపతి ప్రవేశం చిత్తం చిత్తం అంటూ కోలాహలంవెంట ప్రవేశం)

పృధ్వీ—ఈ ప్రపంచలో సత్యమూలేదు, సంతృప్తి లేదు. ఉంటే ఈ ధర్మశాస్త్ర పరికరాలూ, ఈ విశ్వమానవ లోకాలూ, కళాకాంతుల్తో ప్రకాశించేవి. బంధువుల్ని నమ్ము దామాఅంటే బ్రతికుండగానే పైబడి పీక్కునితినే రాంబందు వులైనారు వాళ్ళు. స్నేహితుల్ని చూద్దామాఅంటే సరియైన ప్రాణప్రదమైన సలహాఇచ్చే స్నేహితుడొక్కడూ కనపడడం

లేదు. అంతా ఈ బంగారుకోటల్ని పగులకొట్టుకొని పోదామనీ, ఈ నవరత్న సౌధాల్ని దోచుకుపోదామనీ దురాశా పీడితులై నక్కి నక్కి చూస్తున్నారు. ఎంతయిచ్చినా తృప్తిలేని యి దురాశాప్రజల్ని తీసికొని తిరుగుబాటు లేవదీస్తున్నారు. ఇహ దయా దాక్షిణ్యాలు చూడగూడదు. కోలాహాలంగారు! మీరే నాకు గురువరేణ్యులు. సెల విప్పాడి ఏంచేయాలో.

కోలా—ప్రభూ! ఈ కోలాహాలం గొంతులో ప్రాణమున్నంతవఱకూ మీకొచ్చిన భయమేమీ లేదు. ఎవరి ఆటలూ సాగనీయను. ఎంతకాలం ఇట్లా యీప్రజ ఎదురు తిరిగి సమ్మెలుచేసి భీష్మించి కూర్చుంటారో చూస్తా. నిన్నటి కొలుపుల్లో జాతర్లలో యీప్రజల పసేమిటో తేలింది. వీళ్ళ కల్ల బొల్లేడ్పులు వినేదిక్కేది? బాగా ఎముకలు విఱగపొడిపించాను. నున్నంనున్నం చేయించాను. వీళ్ళు అలిగి సాధించి తెచ్చుకొన్న మహాప్రసాదం, తల చిల్లులూ కాళ్ళూచేతులూ విఱుపులూ. ఇంతేవాళ్లు సంపాదించుకొన్నది. ఆస్పత్రిలో బడ్డారు.

పృథ్వీ—మన డాక్టరుగారి ఆస్పత్రిలోనే!

కోలా—అవునుస్వామి! అయితే వీళ్ళమొఱ వినిపించుకొనే దిక్కేది? డాక్టరుగారు ఏవో కట్లుకట్టి అందర్నీ ఖైదీలుగా కట్టేశారు. ఈ ప్రజానాయకుడైన హోలాహాలానికే ఇంకా తగల్లేదు. తప్పించుకొని తిరుగుతున్నాడు.

పృథ్వీ—హోలాహాలంగూడా ఆస్పత్రికొచ్చాడా?

కోలా—వచ్చాడు స్వామి! అతఁడు రాకుండా వుంటాడా? ప్రజలతరఫున సర్టిఫికెట్లు తీసుకుపోవటానికొచ్చాడు

పృధ్వీ—డాక్టర్ సర్టిఫికేట్టిచ్చాడా?

కోలా—లేదు స్వామి. ఇప్పుడు కాదన్నారు.

పృధ్వీ—అంటే, మళ్ళీ ఎప్పటికో యివ్వటానికి సిద్ధమయ్యాడన్నమాట. అసలీ డాక్టర్కి బుద్ధిలేదు. బుద్ధుంటే వాళ్ళనీ అట్లా చేరనిస్తాడా?

కోలా—అదే నాకూ కూడా కొంత అనుమానం వేసింది.

పృధ్వీ—మీరు చెప్పకపోయినారా మరి?

కోలా—చెప్పాలెండి. చెప్పకుండా వుంటానా. మన తరఫున నన్ను కొట్టినట్లు సర్టిఫికెట్లుగూడా తెచ్చాను. మన తరఫున డాక్టరుగార్ని సాక్ష్యంలో బిగించాను. వెంటనే వచ్చి తమ దర్శనం చేసుకుపొమ్మనమని చెప్పొచ్చాను. ఈపాటికే రావల్సిందిగూడా మరి.

పృధ్వీ—దగ్గరెవ రెవరున్నారు?

కోలా—దురాగ్రిహిగారివైపు శక్తికాంతగారున్నారు.

పృధ్వీ—(ఆశ్చర్యంతో) ఆమెందు కొచ్చినట్లు?

కోలా—అంతకు ముందు దురాగ్రిహిగారుకూడా వచ్చివెళ్ళారు. వీ ళ్ళిద్దఱూ రావడంవల్ల నాకూ అనుమానమే తట్టింది. ఒకవేళ డాక్టర్ని ప్రిజలతరఫున తిప్పటానికి నాటకం ఆడుతున్నారేమొ.

పృధ్వీ—అంతే అనుకోవాలి. ఇంకా రాలేదేం డాక్టరు మరి.

కోలా—అదే చూస్తున్నా నేను గూడా. నేను వెళ్ళి ఆరా తీసుకొస్తా, వుండండిస్వామి (పోబోవును)

పృధ్వీ—అరా తీసుకోటమేగాకుండా వెంటబెట్టుకొని రండి.

కోలా—చిత్తం (నిష్క్రమించు)

పృధ్వీ—ఇదంతా మా అన్నగారైన దేవుడిబిడ్డలు సాగించిన. నాటకమే. ఏమాత్రం సందేహం లేదు. ఆస్తి పాస్తులు పోబట్టే యిట్లా దిగారు. అసలు ప్రిజల్లో పుట్టిన వుండు వీళ్లవల్లనే రేగి మధ్యమధ్య పెద్దగోల లేస్తున్నది. ఇహ ఈ దేవుడిసంతానానికి యీ కాస్తకూడా లేకుండా జేస్తే గానీ పోరు చల్లారదు. పాపంగదాఅని వీళ్ళకుండటానికి ఇల్లూ వాకిళ్ళిచ్చి పొలం పుట్రి యిచ్చి జాలిపడబట్టే యేకు మేకై కూర్చున్నారు. (చూచి) ఎవ రది?

భూదేవి ప్రివేశం

భూ—ఎవరూ లేదు నేనే

పృధ్వీ—ఇహ మీరుగూడా వచ్చారూ!

భూ—ఎందు కంత విసుక్కుంటారు?

పృధ్వీ—అనవసర ప్రిసంగాలకి.

భూ—పోనీ మానేయండి.

పృధ్వీ—ఇట్లా ఎగబడుతుంటే ఎట్లా మానేయటం?

భూ—ఎవర్నీ హింసించకుండా వుంటే చాలు.

పృధ్వీ—ఎవర్నీ హింసించకుండా వుండే వాళ్ళు సన్యాసులు.

భూ—కాదు. ప్రిభువులు

పృధ్వీ—అయితే సరే. తమరు దయచేయండి.

భూ—నామాట వినండి.

పృథ్వీ—నేను క్షాత్రివంశ సంభూతుడను. ప్రభు మర్యాదకోసం జీవించువాడను. సర్వసర్వంసహాస్థలి నా యేలుబడిలో నడవాలి. అంచేత అందఱూ నామాట వినాలి. జ్ఞానబలమూ, సాహసబలిమూ గలవా డెవఁడో వాడే ప్రభువు. ఈ రెండుచిహ్నములు చూచియే రాజ్యలక్ష్మి నన్ను వరించినది.

భూ—అందుకనే వేడుకొంటున్నది.

పృథ్వీ—ఏమని?

భూ—ప్రిజల కోర్కె తీర్చమని.

పృథ్వీ—ప్రిజలకోర్కె తీర్చేది ప్రిభువుకాదు. భగవంతుడు.

భూ—మఱి ప్రిభు వెందుక?

పృథ్వీ—కావలికాయటానికి.

భూ—ప్రిజలకి అన్నం లేనప్పుడు ప్రిభువు కావలిమట్టు కెందుకు?

పృథ్వీ—సరే వాళ్లు నీ కాళ్లబడ్డారా ఏమిటి?

భూ—మన ప్రిజలు మన బిడ్డలు. మన కాళ్ళబడక యెవరికాళ్లమీద పడతారు?

పృథ్వీ—సరే నీవు రాణివిగా. నీవు తీర్చు పాపం వాళ్ల కష్టాలు.

భూ--మనం ప్రిభుదంపతులం. ప్రిజలకితల్లిదండ్రిలం.

సీ. ఈ దివ్య భారాధరాది సౌధాగ్రి సౌ
దామినీ తన్వీ సంతానమహిమ

ఈ జీవనిర్ఘరిణీ జన్యకాంతార
కేధారలక్ష్మి వినోదగరిమ
ఈ మనోహర శారికామయూరమరాళ
శుకపిక సంసార శోభలఘిమ
ఈ మహావీర మహా మహిళా విశా
ల యశోవిశాఖ కల్పప్రశస్తి
ఏయుపాగ కృపారస హృదయములలో
చల్లగా లేచి నేడు భూవల్లభులకు
ఇన్ని రత్న సింహాసనా లిచ్చినదియొ
చూచుకొని రాజ! ప్రజలను గాచుకొనుడు.

పృధ్వీ—సరే బాగావుంది బోధ ఇంత జాలివడి ప్రజల కష్టాలు చూస్తున్నదానవు పాపం నీవుగూడా ప్రార్ధిస్తే గాని ప్రభువు కనికరించడని యిదొకఎత్తు ఎత్తి నిన్ను పంపా రన్నమాట. అర్ధమయింది. హరిహర బ్రహ్మాదులు దిగివచ్చి మొత్తుకొన్నా యీ దేవ్రుషి సంతానాన్ని యీ ప్రళయకాల కారణభూతులయిన ప్రజల్ని కనికరించకూడదు, కనికరించను. నీవు నీ అంతఃపుర రాజకార్య నిమగ్నురాలవై వుండుము. పొమ్ము. ప్రజల్ని స్వేచ్ఛగా వదలిపెడితే ప్రభుత్వాలు సాగవు. ప్రజలకి ఒకనాలుక లేదు. ఒక తలా లేదు. తలో మాటా, తలోదారీ తీస్తున్న ప్రజల్ని విశ్వసించి యే కార్యా నికీ దిగకూడదు. నీవు ఆడదానవు, అంతఃపురకాంతవు. నీకు ప్రజాప్రపంచధోరణి బాగా తెలియదు పొమ్ము.

భూ—నాకు ప్రభువుధోరణి తెలిసియే వేడుచున్నాను.

పృథ్వీ—వేడుకొన్ననూ, మొత్తుకొన్ననూ ప్రయో జనం లేదు.

(తెరలోంచి ప్రభూ! డాక్టరుగా రొస్తున్నారు)

పృథ్వీ—సరే! డాక్టరుగా రొస్తున్నారు. మేము చాలా మాట్లాడుకొనవలసిన వ్యవహారాలున్నై. నీవు త్వరగా వెళ్లు

భూ—మన వ్యవహారాల్ని మన సమస్తరాజ్యాల్ని యీ డాక్టర్లూ, యీ కంట్రాక్టర్లూ కాదు కాపాడుతున్నది. వీళ్ళు మీ ఆస్తిపాస్తుల్నీ, వంశమర్యాదల్నీ పాడుచేయటానికి మూగుతున్న ముఠాదార్లు. వీళ్ళ స్నేహంబట్టి రాజ్యాన్ని నేల పాలు చేయకండి. ఈ ప్రాణఘాతకుల్ని చేర్చి ఈ గోముఖ వ్యాఘ్రముల మాట నమ్మి కన్నబిడ్డలవంటి ప్రజల్ని మంటి గడ్డలు చేసుకోకండి. మీ దారుణశాసనాలకీ మీ ఘోర తంత్రాలకీ ప్రజల పూరికుటీరాలు తగలబడుతున్నై.

పృథ్వీ—ఇక చాలించు ఉపన్యాసం.

భూ—ఇక చాలించండి తంత్రాంగం.

పృథ్వీ...(గుప్పెట్టిజేసి) ఆ! ఏమిటి! (లేచు)

భూ—ప్రళయం కట్టిపెట్టండి.

పృథ్వీ—ఓసి మూర్ఖురాల! నీవుగూడా తిరస్కరించి ధిక్కరించి కవ్వించెదవా! ఇక పదా! సహించను.

(లాక్కొని పోవును)

(తెర పడును)

2వ రంగం. పృధ్వీపతిగారి క్లబ్బు.
కోలాహలం—డాక్టర్ ప్రవేశం

డాక్ట—దివాణంలోనుంచి యెంతసేపటికీ ఇవాళ ద్వార గారు రానికారణం ఏమిటి?

కోలా—ద్వారగా రివాళ చాలా కోపంతో వున్నారు. షికారికి రా రేము.

డాక్ట—ఎవరిమీద కోపం?

కోలా—ఇంకా ఎవరిమీదంటా రేమిటి? ఎంతఇచ్చినా ఎంతచెప్పినా వినని వారిమీద. భయభక్తులు చచ్చిపోయిన యీ మాయదారి ప్రజలు రాణీగార్ని చూచి యేంచెప్పారో యేమో; రాణిగార్కి దొరగార్కి గూడా చెడింది. దివాణం అంతా గోలతో ఘోషిల్లుతున్నది.

డాక్ట—రాణిగారు దివాణంలో వున్నారా ఇంతకూ?

కోలా—ఏమో! ఎందు కుంటారు? రాణిగారుకూడా పార్టీకట్టారు.

డాక్ట—అయితే రాణీగారు ప్రజలపక్షం నిల్చారన్న మాట.

కోలా—సందేహం లేదు. వారి ధోరణి చూస్తేమట్టుకు నిల్చా రనుకోవాల్సిందే.

డాక్ట—ఈ విషయంలో పృధ్వీపతిగారయితే, భూదేవి గార్ని వదిలిపెట్టిగూడా ప్రజల్ని సాధిస్తారా?

కోలా—ఈ ప్రజల విషయంలో యెంత పనికైనా సాహసించేటట్టే కనపడుతున్నారు.

డాక్ట—అట్లాగాకుండా ప్రజలకీ ప్రభువుకీ రాజీచేసి రాజ్యాన్ని కాపాడే ఉపాయం మీకు తట్టడం లేదా?

కోలా—ఇంత దురాశాపీడితులైన ప్రజల్ని ఎవరూ సంతృప్తిపరచలేరు. పట్టపగ్గాల్లేని యీ ప్రజల్ని యిట్లా నయాన దారికి తీసుకురాలేరు. చతురుపాయాలలోకల్లా క్రియాశూరత్వం చూపించే దండోపాయంతోనే దారికి వస్తారు.

డాక్ట—ఇంతవఱకూ ఆ వుపాయంతో సాధించి సంపాదించిం దేముంది?

కోలా—అదేమిటండి, అన్నీ తెలిసి అట్లాఅంటారు? ఏమందుకి చితుకని గడ్డని మీరెట్లా ఆపరేషన్ చేస్తున్నారో అట్లాగే యీ ప్రజలవిషయంలో రాజధర్మం నడిపించాలి. అసలు ఆపరేషన్ పని చేసినట్లు కోఆపరేషన్ పని చేయదు.

డాక్ట—సరేలెండి. దోరగా రాస్తున్నారు.

కోలా—రానీయండి. ఇప్పుడు మీరేమీ రాజీప్రసంగా లెత్తకండి. మండిపడతారు.

డాక్ట—నాకుమట్టుకు తెలియదండి,

(పృథ్వీపతి పార్టు దిగి భట్టుతో, గుట్టుతో ప్రవేశించును)

(అంతా నిలబడుదురు)

పృథ్వీ—ఎంతసేపైందండి మీరొచ్చి?

కోలా—ఇంతకుముందేనండి. అరగంటకాలేదండి మనంవచ్చి డాక్టరుగారు?

డాక్ట—అవునండి, అరగంటే అయిందండి.

పృథ్వీ—ఇహ ఈ ప్రజానాయకుణ్ణి పట్టుకొంటేగాని ప్రజలు దారికి వచ్చేట్టు లేదు. కూర్చోండి.

డాక్ట—చిత్తం పట్టుకోవాలి.

(అందఱూ కూర్చుందురు. ఫలహారాలు తెచ్చిపెట్టెదరు)

కోలా... (తింటూ) పట్టుకోటమేగాదు ఎముకల్ని విఱగపొడిపించాలి.

పృథ్వీ—మా అన్నగారి బిడ్డలుగూడా ప్రజలపక్షాన చేరారట.

డాక్ట—ఇది వట్టి పుకారండి.

కోలా—పుకారూగాదు, షికారూగాదు. మీ కింకా తెలియదు వూరుకోండి.

పృథ్వీ—నిజమేనండి డాక్టరుగారు. ఈవార్త గాలి కబురుగా భావించకండి. ఈ భట్టుగార్ని అడగండి ంకా.

భట్టు—యథార్థం స్వామి!

గుట్టు—ముమ్మాటికీ యథార్థమండి.

డాక్ట—మీ కెట్లా తెలిసింది?

కోలా—వా ళ్ళెప్పుడూ రెండుసంస్థానాల్లోనూ తిరుగుతుండేవాళ్ళు కాబట్టి.

డాక్ట—అయితే; యేం చేశారు? ఏం చెప్పారు?

భట్టు—రాణీగార్ని తిరగదీశారు.

గుట్టు—ప్రభువుగార్కి ప్రాణప్రమాదంగూడా తెచ్చిపెడుతున్నారు.

డాక్ట—ఇదంతా ఎవరివల్ల జరుగుతున్నది?

భట్టు—సత్యాగ్రహివల్ల.

గుట్టు—దురాగ్రహంవల్లకూడా జరుగుతున్నది.

కోలా—ఇ దెట్లా వట్టిపుకా రవుతుందండి?

డాక్ట—ఇంకా ఈ రాజద్రోహుల్ని కనికరించ కూడదు. అన్నగారి బిడ్డలుగదాఅని అవ్యాజప్రేమతో పోషి స్తున్నదానికి ఎంత కృతఘ్నతాదోషం చూపిస్తున్నారు. ఈ కృపారస సార్వభౌము డింతవఱకూ కరుణించకపోతే వీళ్ళగతు లెట్లా వుండాలో అట్లా వుండేవి. మూర్ఖులు, గోముఖ వ్యాఘ్రములు. అనుభవిస్తారు.

కోలా—నే నెన్నాళ్ళనుంచి వీళ్ళగుఱించి చెబుతున్నా నండి?

డాక్ట—నిజమేనండి. ఇప్పు డింకా నమ్మాలగదండి.

పృథ్వీ—అన్నగారి బిడ్డలుగానీ, కన్నవారిబిడ్డలుగానీ, వీళ్ళ నింకా వూరికే వదలిపెట్టను. వీళ్ళ కుదురుతోసహితంగా కుదలించి పారేస్తేగాని కన్నుమూయను.

భట్టు—గీ. చెట్టు చెడుకాలమునగాని కట్టకడకు
కుక్కమూతిపిందెలు పుట్ట వెక్కడైన
ఇంత కరుణాసముద్రుని ఈజగాన
తెలుసుకొనక ఘోరాగ్నిలో బడిరి ప్రజలు

డాక్ట—బాగా చెప్పారు. చేసినపాపం వృథాగా పోతుందా?

గుట్టు—పోదు బాబు పోదు.

గీ. కట్టె కంటెననిప్పుతో కట్టె యింక
కాలికాలి నుసియగున కరణి ధరణి

పాడు దుర్బుద్ధి బట్టిన ప్రజకు నేడు
తప్పదు వినాశకాలమ్మ ధర్మరాజ!

కోలా—నిజంఅంతే. మంచి నీతివాక్యం చెప్పారు. మీవంటి ధర్మకోవిదులు రాజ్యంలో, కొంచెం ధర్మప్రచారం చేస్తే ప్రజకి పెద్దా పిన్నా తారతమ్యాలు, ప్రభుభక్తి విశ్వాసాలు పట్టుబడతై బాబు!

పృథ్వీ—అందుకోసమే ఈ మహామహుల్ని సంస్థాన పండితులుగా చేర్చుకొన్నాను.

భట్టు—ప్రభువుగారి దయ, మహాభాగ్యం.

గుట్టు—ప్రభువుగారి హృదయం దయాసముద్రం.

కోలా—మీమాదిరి యీ ప్రజలగ్గూడా ప్రభుభక్తి విశ్వాసాలుంటే ప్రజ కింకా కఱవుంటుందండి?

డాక్ట—సోదరులారా!

ఉ. ఈ వనరాజ్యలక్ష్మి కులు కింత వసంతునిరాక జేసి, భూ
దేవిక నోముపంటలయి దివ్యకళా మృదుజీవనమ్ములై
పావన మైనయట్లు పయిపక్షుల కెక్కడ గ్రాహ్యమౌను స
ద్భావనతోడ మీరు ప్రభుభక్తి పరాయణులై తరించుడీ.

భట్టుగారు! గుట్టుగారు!

భట్టు, గుట్టు—అయ్యా, అయ్యా!

డాక్ట—మీ రుభయులూ కలిసి దేవుణ్ణి, సత్యాగ్రహిని కట్టేయాలి.

భట్టు—చిత్తం. అ దెంతపనండి.

గుట్టు—రెప్పపాటులో కట్టేయగలం.

డాక్ట—తర్వాత జగన్మాతకీ, ముక్తికాంతకీ, ఉపదేశాలు చేసి వేదాంతపిచ్చిలో పడేయండి. వాళ్ళా జాతర్లలో పడివుంటారు

భట్టు—చిత్తం. అట్లాగే.

డాక్ట—దీంతో సర్వస్వమూ పోయి, యీ దేవుడూ, యీ దేవుని సంసారం సన్నగిల్లి అడవులబట్టాలి.

కోలా—అడవులే యేమిటి శంకరగిరిమాన్యాలుపట్టాలి.

డాక్ట—ఇహ శాస్త్ర తెలివిగలవాడై అలవిగాకుండా వున్న యీ దురాగ్రహినిమట్టుకు నేను పట్టుకొంటాను.

కోళ్లా—ఆయన ఇల్లాలో?

భట్టు—ఇల్లాలెవరూ?

కోలా—శక్తికాంత.

డాక్ట—ఆమెని యిదివఱకే కట్టేశాం. ఆమెవల్లనే మన కార్యకలాపాలన్నీ చులుకగా సాగుతున్నై.

పృధ్వీ—ఇహ మా అన్నగారికి పూచికపుల్లంత ఆస్థి కూడా వుంచగూడదు. జాలిపడకూడదు.

కోలా—(నవ్వి) ఆదేవుడు వట్టి పిచ్చిమారాజండీ. ఎవడొచ్చి కాళ్లుపట్టుకొన్నా మెత్తపడతాడు. (చూచి) నూఱేళాయుస్సండి మీకు. అనుకొంటుండగానే వచ్చారు.

(దేవుడు ప్రవేశం. అంతా నిలబడుదురు)

దేవు—కూర్చోండి నాయన (అందరూ కూర్చుందురు)

డాక్ట—(లేచి) దైవమా! నమస్కారం. నేను మీ సంస్థానవైద్యుడను. మీ అవ్యాజ కరుణాకటాక్షంతో బ్రతుకుతున్నవాణ్ణి. అనుగ్రహించాలి. తమకు మార్లు తమ సంస్థా

నానికీ తమ సామ్రాజ్యానికీ చాలా కడగండ్లు తెచ్చిపెడు తున్నారు. దైవమా! నీవు నిరుపేదజనులకు కల్పవృక్షమువంటి వాడవు. నిన్ను కనిపెట్టుకొని నీకు మొక్కుకొని బ్రిదుకు తున్న యీ పేదప్రజలకి ప్రభుభక్తి విశ్వాసాలు పోయి రాజ్యంలో నానాఘోరాల్ని లేపి ప్రభువుమీద తిరుగుబాట్లు లేవదీసి దైవభక్తి రాజభక్తి లేకుండా చేస్తున్నారు. మీ రను గ్రహించి యీ సమస్తప్రపంచ సామ్రాజ్యాన్ని మోసి మీ ఆజ్ఞ జవదాటని మీ తమ్ముడైన పృథ్వీపతిని నానా బాధలు పెడుతున్నారు. దైవమా! నిన్ను చూచి యింతవఱకూ సహించారు. ఇహ యీ రాజద్రోహుల్ని, నీకుమార్లని యిట్లా విడచిపెట్టివుంటే విలయాలన్నీ యేకమౌతై.

దేవు—నాయనా! నీవు చెప్పిన దంతా వాస్తవం. దండనీతి లేకపోతే ధరణీమండలం నిలవదు. అవశ్యకర్తవ్యంగా ప్రభువు దండోపాయంతో సమస్త ధాత్రీచక్రాన్ని త్రిప్పు కొని రావాలి. పరిపాలించాలి. దానిని నేను కాదనను. ఇహ నా కుమాళ్ళకి నేనుగూడా చెప్పిచూస్తాను. వినకపోతే వాళ్లు గూడా అనుభవిస్తారు.

కోలా—దైవమా! నీ విశాలహృదయానికి, నీ దయా రస భావానికీ, మా కృతజ్ఞతాపూర్వకమైన అభివందనాలు. అనుగ్రహించండి. నీ కొడుకులు తెలివిగలవాళ్లేగాని యింటికి ఏమాత్రం పనికిరాని వట్టి అప్రయోజకులైనారు. వాళ్ళకి వాళ్ళ కష్టమూ తెలియదు, ఎదుటివాళ్ళ కష్టమూ తెలీదు. ఇటు వంటి వట్టి అప్రయోజకుల్ని నమ్ముకొని కూర్చుంటే యింత మహాలక్ష్మీవల్లభుడవైన నీవుకూడా కష్టపడక తప్పదు. నీ

భార్యయైన జగన్మాత పూర్వకాలపుమనిషి, ఆమె కేమీ తెలియదు; నీకు నీ తమ్ముడైన యీ పృథ్వీపతి యేమీ తక్కువ చేయడు. నీకు కావల్సినవన్నీ యిస్తాడు. నీకు నవరత్నాలతో ఆలయాలూ, గోపురాలు కట్టిస్తాడు. నీ నిత్య ధూపదీప నైవేద్యాలకి, ఉత్సవాలకీ, ఊరేగింపులకీ ఏమాత్రం లోపం వుండదు.

భట్టు—దైవమా! నీవు ప్రభుపక్షానికి వచ్చి సౌఖ్యం చూచుకో.

గుట్టు—దైవమా! నీవు నిరుపేదవార్ని పట్టుకు పాకులాడితే అన్ని పచ్చిమంచినీళ్లుగూడా పుట్టవు.

పృథ్వీ—దైవమా! నేను నీ తమ్ముడను. మన మిరువురమూ ఒక తల్లిగర్భవాసమున పుట్టి పెరిగినవారము. ఇన్ని రాజభోగములు నే నొక్కణ్ణి అనుభవించటము ధర్మంగాదు. అంచేత నేను నా రాజరికానికి ఎంత వాడుకొంటున్నానో నీవుగూడా అఖిలైశ్వర్యాల్ని వాడుకోవచ్చును. ఇందులో నా కెంత హక్కున్నదో నీక్కూడా అంత హక్కున్నది. ఈరోజు నుంచి సమస్త వేదశాస్త్ర పారంగతులైన యీ భట్టుగార్నీ, గుట్టుగార్ని, నీ కాలక్షేపాలకి వాడుకొనుము.

డాక్టర్—ఎంత యిచ్చినను సంతృప్తిపరచలేకుండా వున్న యి పాపిష్టికాలంలో దైవమా! నీవు నీ బలమంతయు ప్రభువులకి ప్రసాదించుము. నీ వంశప్రతిష్ఠ కాపాడుకొనుము.

గీ. కూలివారిని నీవు నీ కాలిక్రింద
తొక్కిపట్టి ప్రాణాలను తోడునాడు

భాగ్యవంతుల మోసి మా ప్రభువు నిన్ను
సిరులతో మహాదేవ! పూజించుచుండు.

దేవు—అట్లాగే తండ్రీ! ఒకపక్క డొక్క కాలు స్తుంటేగాని ప్రజలు మాట వినరు. ప్రపంచం నడువదు. పేద వాళ్ళనిమట్టుకు అష్టదరిద్రాలలోనూ, అష్టకష్టాలలోనూ పడేసి వుంచటమే నాగ్గూడా కావాలి. తప్పకుండా వుంచుతా. అయితే, నాకరివాళ్ళేమన్నా వాళ్ళకి సహాయం చేస్తుంటా రేమో. అదికూడా కనిపెడుతుండాలి.

డాక్ట—అటువంటప్పుడు నీకుమార్లని చూచికూడా జాలిపడగూడదు.

దేవు—నిజంగా జాలిపడరాదు. జాలిపడితే ప్రపంచం ఎట్లా సాగుతుంది? ఆగోల ఎక్కడిది?

(తెరలోంచి)

(ప్రభూ! ప్రభూ! బందిపోటు వూరుమీదపడి దోపిడి చేస్తున్నది)

(అందరూ లేతురు)

కోలా—ఆ ఆ పట్టపగలే దోపిళ్ళు మొదలుపెట్టారా? ఎట్లా ప్రభూ! ఇంకా శాంతించగూడదు. ఇది ఈ దేవుడి కొడుకులు చేయిస్తున్న దోపిళ్ళు, సందేహం లేదు.

పృధ్వీ—ఈగోల రాణీగారు లేపినట్లుంది. లేకపోతే అంత సాహసం వీళ్ళ కెక్కడిది?

డాక్ట—నిశ్చయంగా అంతే. పదండి. గోల పెద్ద దయింది. (నిష్క్రమింతురు)

(తెర పడును)

3వ రంగం భూదేవి మందిరం.

(భూదేవి నిద్రించుచుండును.
మారురూపంతో హాలాహలం ప్రవేశం)

హాలా——ఇది రత్నగర్భయైన భూదేవిమందిరం. ఈతల్లి చల్లని దయవల్ల ఇంకా ఈనాడుకూడా. మా కష్టజీవాల డొక్కల కష్టానికి అంత కలీ అంబలీ దొరుకుతున్నది. ఈ తొమ్మిజనయిత్రి యెంత ఓర్పుగలదోగాని, కన్నకుమారులకోసం కడుపుమాడ్చుకొని కాలువలు కట్టుకొని అసహ్యాము లేక ఆయాసము లేక బాధపడుచున్నది. ఇంతదయ ఏప్రభువు కున్నది? ఏ దేవుడి కున్నది? నెత్తురోడ్చుకొని, కండలు తెఱుగుకొని, ఎముకలు పగులకొట్టుకొని యిన్ని నవరత్నసౌధాలు కట్టుకొని బిరుదుబారులు పెంచుకొని, కూర్చుని లేవలేని యీ ధనికులకు, యీ నరహంతకులకు దయ యేకోశానా లేదు. ఇటువంటి సోమరిపోతులను బలిపించుకొని గుళ్ళు గోపురాలు కట్టించుకొని యీ కష్టజీవాల్ని బలిచేయించుకొని మూగ మొద్దుగా తయారైన దేవుడికి, రాతిబండగా తయారైన దేవుడికి దయా లేదు. చూపూ లేదు. అన్నీ పోయినై. ఉంటే లోకాలిట్లా కాలేవే కావు.

(ధావళీలు కట్టుకొని వేపమండలు పట్టుకొని
భట్టూ, గుట్టూ ప్రవేశం.)

భట్టు——ఎవ రయ్యా నీవు?

గుట్టు——ఎందు కిక్కడి కొచ్చావ్?

హాలా——నేను దాసుణ్ణి!

భట్టు—అయితే ఎందు కొచ్చావంట!

హోలా—భూదేవమ్మగోర్కి యంత్రం కడదామ నొచ్చా.

భట్టు—సరే కడదువుగాన్లే.

గుట్టు—దూరంగా వుండు.

హోలా—సామగ్రింతా తెప్పించరూ దొర్లూ?

భట్టు—తెప్పిస్తార్లే.

గుట్టు—నీ యంత్రాలకితోడు సామగ్రికూడా కావాలీ?

భట్టు—కానియ్యవోయ్! గుట్టూ! నేను చెబుతుంటే నీవు వేపమండతో విసరుతూవుండు.

గుట్టు—సరే కానియ్యి.

భట్టు—ఓం, హ్రైం, హ్రీం, మహంకాళి. ఓం, హ్రైం, హ్రీం, మహంకాళీ.

గుట్టు—(వేపమండ త్రిప్పుతూ) కాస్త దారికొస్తున్నట్లున్నది.

భట్టు— ఎవరికోసం వస్తుందిరా? ఓం, హ్రైం, హ్రీం, మహంకాళీ. పదా దొరగార్కి చెప్పొద్దాం (నిష్క్రమింతురు)

హోలా—ఇన్ని మాయమంత్రాలకీ, ఇన్ని దొంగ వేషాలకీ మర్యాదా గౌరవం వుందిగానీ, రాత్రింబవళ్ళు ఎముకలు పగులకొట్టుకొని యిన్ని పట్టణాల్నీ, ఇన్ని ఫ్యాక్టరీల్నీ నడిపిస్తున్న యీ కష్టజీవాలకి సంఘంలో మర్యాదా లేదు మన్ననా లేదు. పాపం మావంటి కష్టజీవాలకోసం నానాహింసలకి లోనై కుంగి కృశించుతున్న యీ భూదేవికి పీడపట్టిందనీ, పిశాచం పట్టిందనీ, దొంగదొంగ శాస్త్రాలు చెప్పి

యిట్లా మావంటి కష్టజీవాల కష్టార్జితాన్ని దోచుకొం టున్నారు

గీ. ఇంత రత్నగర్భవయి విశ్రాంతి లేక
పంటలన్ని పండించి ప్రపంచమందు
కటకటా! యిటువంటి రాక్షసుల చేత
శల్యపంజరమైతి భూజనని నీవు..

(భూదేవి లేచి)

భూదే—ఎవరు మీరు?

హాలా—తల్లీ! నీ తనయుణ్ణి హాలాహలాన్ని.

భూదే—తండ్రీ! ఈ రాక్షసులదగ్గర కెందుకొచ్చావు?

హాలా—తల్లీ! నీ చెఱలు తప్పించటానికొచ్చాను.

భూదే—తనయా! నే నింత బంగారుపంటల్ని పండిం చుకొని మి మ్మిట్లా పస్తులుపడుకోపెడుతున్న నిర్దయురాల మీద మీ కీ పిచ్చిభ క్తెందుకు?

హాలా—మమ్మల్ని పస్తులు పడుకోపెడుతున్నది నీవు కాదుతల్లి! జీవితంలో శ్రమఅన్నది యెఱుగక సోమరితనంతో సుకుమారతనంతో సుఖభోగలాలసులైయున్న యీ దేవుళ్లూ ధనికులూ మాకూడు పడగొట్టి మమ్మల్నీ మాపిల్లల్నీ పస్తులు పడుకోపెడుతున్నారు. ఇంత మహా ఘోరదారుణ ఘాతుక లోకంలో భూమాతా! నీచల్లని కృపాకటాక్షంతో బ్రతుకు తున్నాం.

భూదే—(రత్నహార మిచ్చి) నాతండ్రీ! ఈ కష్ట కాలంలో ఇటువంటి దయాదాక్షిణ్య శూన్యులైన రాక్షసుల

ముందు బ్రతకటం కష్టం ఈ రత్నహారము ఖర్చుపెట్టుకొని కాలాన్ని నెట్టుకొని జీవించండి, దొరబొచ్చు వేళ్ళ అయినది వెళ్ళివస్తా (నిష్క్రమించు)

హోలా—ఆహా! ఈ భూజనని యెంత కరుణారస నిర్ఝరిణియై తన బిడ్డల్ని యింత ఆపత్కాలంలో ఎట్లా కాపాడుకొనుచున్నదో చూడండి. ఈమె కడగండ్లు తీర్చటమే మా కష్టజీవాల ప్రధాన విద్యుక్తధర్మమై వుంది. ఇప్పుడు ఈ దొంగవేషధారుల్ని హడలుకొడితేగాని దేశాలు బాగుపడవు. (బ్రహ్మరాక్షసి విగ్గు పెట్టుకొని రగ్గు కప్పుకొని భూదేవిపాన్పు మీాద పరుండివుండును) ఇహ ఈ కొంగజపాలవార్ని యీ దొంగ గురువులవార్ని పట్టుకొని యేడిపించితీరాలి. అరుగో వస్తున్నట్లున్నారు. (ముసుగుపెట్టుకొని పరుండివుండును)

భట్టూ, గుట్టూ మంత్రాల్తో ప్రవేశం

భట్టు—ఈ దెబ్బతో పట్టుకొన్న దయ్యం దారిపట్టాలి

గుట్టు—కాళ్ళుపట్టాలి. ధూ మహాంకాళీ ఓం హ్రైం హ్రీం, మహాంకాళీ.

హోలా—(కూనస్వరంతో) ఎవరో దగ్గఱకి రండి.

భట్టు—మాట్లాడకయ్యా! అమ్మగార్కి స్పృహ వచ్చింది.

గుట్టు—ఏమిటో చెబుతున్నారు వినవయ్యా!

హోలా—దగ్గఱకి రండయ్యా ఎవరో.

భట్టు—దగ్గఱకి రమ్మంటున్నారు. మనమంత్రం బాగా పారిందయ్యా. ఇంకోమాటు మంత్రోచ్చారణ చేయి. శేషమేమాత్రం లేకుండా లేచిపోతుంది.

గుట్టు—ఓం, హ్రైం, హ్రీం, మహాకాళీ, పిలుస్తున్నారు. పదవయ్యా.

భట్టు—అమ్మా! వస్తున్నాం. చిత్తం. ఇక్కడేవున్నాం నీవుగూడా రావయ్యా (ఇద్దఱూ చేతులు నలుపుకొంటూ దగ్గ ఱకు పోదురు)

హాలా-(తటాలున లేచి ఇద్దఱిజుట్టూ పట్టుకొని) మీరు మంత్రవేత్తలా? దయ్యాల్ని వదలకొట్టే భూతవైద్యులా!

భట్టు-(తెల్లగుడ్లువేసి) ఇదేమిట్రో! ఇది దయ్యమర్రో!

గుట్టు—(నాలుక చాచి)అయ్య బాబోయ్!ఇది దయ్య మర్రో.

హాలా—ఇది మీ సంస్థానాలకీ, మీ సామ్రాజ్య వాదులకీ, పట్టిన దయ్యం. ఊరికే వదలిపెడితే యెట్లా? మిమ్మల్ని సోదిలోగ్గూడా రాకుండా తెగటార్చితేగాని దేశ దేశాలలో లేచిన ఆకలిమంటలు చల్లారవు (ఇద్దరిజుట్లకీ ముడి వేసి పడద్రోసి రివాల్వారు తీసి ఫైరుచేసి) మీవంటి సోమర పోతు ముఠాలు మాఠణమైపోతేగాని లోకాలు పచ్చపడవు. (పారిపోవును) (భట్టూ, గుట్టూ చచ్చి పడివుందురు)

(కళకళలాడుతూ కోలాహలం ప్రవేశం)

కోలా—భట్టూ! గుట్టూ! ఇవాళ్ళతో మంత్రాలు సమాప్తమైపోతయ్యా? ఏ మి టి! మౌనమంత్రంలో వున్నారా! భలేమంత్రగాళ్లు. వీళ్ళని పట్టుకొని, పధ్నాల్గు భువనాల్నీ జయించవచ్చు. (శవాలు కాలికి తగిలి చూచి తెల్లబోయి) ఇదేమిటిబాబో! ఎవరు వీరు! భట్టూ! గుట్టూ! ఎవ రిక్కడ పడివున్నారు? (చూచి) వీళ్ళు భట్టూ, గుట్టూ

మాదిరున్నారే! ఈర క్తం ఏమిటి? ఈ ప్రళయం ఏమిటి? ఇంత మహామంత్రవేత్తల్నే బలిగోరిందే దయ్యం. ఇది దయ్యమా! బ్రహ్మరాక్షసా? అమ్మ బాబోయ్! ఎట్లా! నా కాళ్ళాడటంలేదు (వణకుతూ) ఈ బ్రహ్మరాక్షసి నన్ను గూడా మ్రింగేస్తుందేమో (ఉలిక్కిపడి) అమ్మో! అయ్యో! నే నెప్పుడూ నీజోలికి రాను, నన్ను పోనీ. నీకాళ్లకి మొక్కుతా. (చెంపలు వాయించుకొని) ఇహ నే నెప్పుడూ అనవసరమైన వాటిని కట్టుకొని బయల్దేరను. ఓ బ్రహ్మరాక్షసీ! నా సర్వ స్వమూ నీకు ధారాగతం చేస్తా. నన్ను విడిచిపెట్టు. అమ్మో అబ్బో!

పృధ్వీపతి ప్రవేశం

పృధ్వీ—ఏమిటండి కోలాహలంగారు! (పట్టుకొని) ఏమిటండి చెప్పండి? ఫరవా లేదు.

కోలా—శ్రీ బ్రహ్మరాక్షసిగారు! మీకు రానివి లేవు. నన్ను విడిచిపెట్టండి.

ప్రిధ్వీ—(నవ్వి) నేను బ్రహ్మరాక్షసిని గాదండి. పృధ్వీపతిని. భయం లేదు చెప్పండి.

కోలా—మా ప్రిధ్వీపతిగారివేషం వేసికొనివచ్చారా యేమిటి? బ్రహ్మరాక్షసిగారు! క్షమించండి.

డాక్టరు ప్రవేశం

డాక్ట—ఏమిటండి గోల? ఈ శవా లేమిటి! పాపం భట్టుగార్ని గుట్టుగార్ని ఎవరో చంపిపోయారు. వీర్నిగూడా కొట్టినట్టున్నారే? (పట్టుకొని) పదండి తీసుకొనిపోదాం. ఇది ప్రజలు చేసిన హత్య, పదండి (తెర పడును)

# ఆ క లి మం ట

## చతుర్థాంకము

1వ రంగం—దురాగ్రహి రూమ్

(సారా తాగుతూ సిగిరెట్టు పీలుస్తూ)

"సారాలు తాగాలి, సారాలు కాయాలి -

మాగినా త్యాగినీ, తాగినా భోగినీ -

కవులెల్ల మెచ్చాలి, ఘనులెల్ల మెచ్చాలి- సా-

అని పాడుతూ.

దురాగ్రహి ప్రవేశం

దురా—మా సత్యాగ్రహికి ఇంకా ప్రపంచంసంగతి బాగా తెలియకపోవటంవల్లనే పాడు మూఢవిశ్వాసాలతో కొట్టుకొంటున్నాడు. ఈ చాదస్తంవల్ల నా లైఫ్గ్గూడా దెబ్బ తగులుతున్నది. సాహసం లేకపోబట్టే తామసం లేనట్టుగా కని పిస్తాడు. అడుగో వస్తున్నాడు.

సత్యాగ్రహి ప్రవేశం

సత్యా—(ఆదుర్దాగా) అన్నయ్యా! ఎంతపనిజరిగిందో విన్నావా?

దురా—ఏమిటి?

సత్యా—భట్టునీ గుట్టునీ ఎవరో ఖూనీచేశారు.

దురా—ఇంకా దేశాలు బాగుపడతై. పీడ వదిలింది.

సత్యా—పాపం పొట్టకోసం వాళ్ళేమిటో తిప్పలుపడు తుంటే యీ ప్రజలు వాళ్లజోలికి పోవట మెందుకు?

దురా—అయితే వాళ్లసంగతి నీకేం తెలియదుగాని నీవూరుకో. పాడుపొట్టకోసం మాయశాస్త్రాలు చెప్పి ప్రజల్ని అమాయకంలో దించి, ప్రజలకష్టాన్ని తేరగా సోమరి పోతులకు మేపుతున్నారు. ముందు దేశాల్లో యీ పురుగుల్ని యేరిపారేస్తే ప్రజాజీవితాలు తేజోవంతంగా వుంటై. (సిగిరెట్టు కాలుస్తూ పుస్తకము చదువుచుండును)

సత్యా—అన్నయ్యా! పశుబలంతో ఎన్నటికీ దుర్మార్గాల్ని అణచలేం. చక్కని శాంతిభిక్షతో దిద్దుకొనిరావాలి. దీనివల్ల కక్షలు పెరగవు. ప్రజాసమూహంలో ఐకమత్యబలం బాగా పట్టుబడితే ఎంతకార్యాన్నైనా సాధించవచ్చు. ఎట్లాగైనా శాంతిసత్యాగ్రహ శిక్షణతో ఐకమత్యబలం ప్రజకి బాగా పట్టించాలి.

ఉ. శాంతినికేతనమ్మున విశాలకళా మృదుజీవనమ్ము సి
ద్ధాంతము సేయఁగల్గెడి మహాఘనభాగ్యము లుండెగాని, రా
ద్ధాంతము లేచుచుండెడి రణాలయమందు, సమస్తవిశ్వ వే
దాంతము లేమి యున్నవి సుఖాంతముతో? నవదేశసోదరా!

దురా—(నవ్వి) పిచ్చివాడా! ఎంతకష్టపడి శాంతిబోధ చేశావ్. జగత్తు పుట్టినలగాయతు యింత శాంతిబోధతో యే మహాత్ముడూ సాధించిందేమీ కనపడటంలేదు.

గీ. కొండపైనుంచి దొర్లి వేదండకోటి
కాళ్లక్రింద నలిగి పాముకాట్లను తిని

భక్తప్రహ్లాదుడే మున్ను వసుధపైన
నారసింహాకృతిని శాంతి కోరినాడు.

అంత భక్తప్రహ్లాదునికన్న నేడు నీ విన్ని పాట్లు పడి సాధించెడి దేమున్నది? అదీగాక,

సీ. భీష్మ ద్రోణాది వీరులు భీకరముగ
రక్తవాహిని లేపి సంగ్రామమందు
ధర్మవాక్యమ్ములను జెప్పి ధరణి ప్రజకు
శాంతిరాజ్యమ్ము జూపించి చనిరిగాదె.

డాక్టరు ప్రవేశం

డక్ట—ఏమిటండి చాలా వివాదం పెట్టుకున్నారు?

సత్యా—ఏమీ లేదుగానండి. విశేషా లేమిటి? కూర్చోండి,

డాక్ట—(కూర్చుని) చాలావున్నై; నిన్న జరిగిన ఖూనీలు మీకు తెలిసే వుండవచ్చు.

దురా—అవునట. ఎవరో జాడా తెలిసిందా?

డాక్ట— తెలిసింది. కొంతమంది చిక్కారు. ఈ తిరుగుబాటు నాయకుడైన హాలాహాలమే చిక్కలే దింకా.

దురా—అత డెక్కడ చిక్కుతాడు లెండి.

సత్యా—ప్రభుత్వం తలచుకొంటే ఎవడైన చిక్కుతాడు.

దురా—నీవంటి పెద్దన్నయ్యలు ముఖ్యంగా చిక్కుతారు.

సత్యా—అయితే నీకేం తెలియదుగా నింకా ఊరుకో.

దురా—నీకు తెలిసివచ్చిం దేమిటి?

సత్యా—నీవంటివాళ్లసంగతి,

దురా—తెలిసి యేం చేస్తావ్? పేలాలు.

సత్యా—నీమాదిరి విరగబడి నేను పేలాలుచేయలేను.

దురా—నీవంటి చవటదద్దమ్మలవల్లనే దేశాలిట్లా అయినై.

సత్యా—ఎవరిమూలంగా దేశాలు మండుకుపోతున్నయ్యో చూస్తునే వున్నారు,

దురా—నిజంగా నీవంటివాళ్ళమూలంగానే దేశదేశాల్లో—

ఉ. ఆలకు రాజభోజనము రాజనివాసము వచ్చి సర్వరా
జ్యాలను మోయుచుండెడి విశాల నిశీథికటీర కష్ట జీ
వాలకు కూడుగుడ్డ కఱవై బలియైనదిగూడ నేడు మీ
మూలము జేసికాదె? చెడుమూర్ఖుడ! ప్రేలుడు కట్టిపెట్టుమీ.

సత్యా—(నవ్వి) వింటున్నారా! అనవసరమైన ఆగ్రహం ఎందుకు?

గీ. ఈ మహామృగజాతి మహీతలాన
ఈ తపోధనుల్ లేకపోయెడిక్షణాన
ఇంక చిన్నప్రాణములు జీవించగలవె?
పుడమి నడిసముద్రములోన మునుఁగునయ్యా!

డాక్ట—అయ్యా! మీ రిరువురూ సమానమైన ప్రతిభాప్రభావం గలవారు. మీ కొకరు చెప్పేవారు లేరు.

దురా—వీడిప్రభావం నాముందా?

సత్యా—వీడి ప్రతిభాప్రభావం నాకు తెలియంది కాదు.

దురా—నీ మందబుద్ధిచేతనే యిన్నికష్టాలు వచ్చి పడ్డై.

సత్యా—నీ గడుసుతనంతోనే పలుకుబడి లేకుండా పోతున్నది.

దురా—నీకున్న పరువుతో ప్రభువుల్నీ ప్రభుత్వాల్నీ కాపాడు చూస్తా?

సత్యా—ఈ సత్యాగ్రహి కంఠంలో ప్రాణమున్న దాకా యీ ప్రభువుకి ప్రభుత్వాలకీ మత్రేం ఫరవా లేదు.

దురా—(వెక్కిరింపునవ్వుతో) నీకోసం ఎవ్వరూ వాచిపోయి చూడటం లేదు. ఇంకా నీవు నంబిసహాయం చేస్తే మట్టుకు చాలా మంచిది. ప్రభువుకీ ప్రభుత్వానికీ నీ వొక లెక్కలోవాడివా? అయినా నీవల్ల జరిగే సహాయం ఈ షణ్మాత్రంకూడా లేదు. గుడ్డికన్ను తెరిస్తే యెంత? మూస్తేయెంత?

సత్యా—పొట్టపొడిచినా అక్షరంముక్క లేని ప్రజల్ని నమ్ముకొని కూర్చుంటే ప్రపంచలో మన మింకా బాగానే బాగుపడతాం.

దురా—పొట్టపొడిచిచూచినా యేమాత్రం దయారసం లేని, యీకఠిన పాషాణ ధనికవర్గాన్ని నమ్ముకొని వెంట వేసుకొని తిరిగితే ఇహ దేశాలు బాగుపడతై. మనం, బాగానే బాగుపడతాం.

డాక్ట—బిక్కాపకీర్లనీ, పక్కా పోకిరీవార్లనీ నమ్ముకొని వుంటే దేశా లెట్లా బాగుపడతైయండి?

దురా—ఈ లేనివాళ్ళల్లో సత్యం, సహనం వుందికనక.

డాక్ట—(నవ్వి) ఫీటివల్లనే దేశాలు బాగుపడ్తై కనక నమ్ముకొని కూర్చోండి. (ఆదుర్దాగా దేవుడు ప్రవేశం)

దేవు—ఏమిటి నాయనా! నీమీదగూడా తిరగబడు తున్నారా?

డాక్ట—ఇంకా లేదులెండి.

దేవు—అయితే మీరు భయమూ, భక్తిలేకుండా యీ పాపిష్టి తిరుగుబాటు దార్లతో తిరిగి యేం కట్టుకొం టారాబ్బి అబ్బీ?

దురా—ఏం కట్టుకోం. ఎప్పుడూ కలవాళ్ళ కాళ్ళు పట్టుకొని గుళ్ళూ గోపురాలు కట్టుకొంటాం.

సత్యా—ఏం చూచుకొని ఇంత యెగసిపడి వెక్కిరిస్తు న్నావు?

దురా—(నవ్వి) ఏంచూచుకొనా! (నవ్వుతూ)
బిర్రగ పొట్టబట్టి కనిపించెడి దేవుని బిర్రబారర్రపై
కుర్రలుకొట్టు దెబ్బలకు గుండెలు జారినవేమొ యింక నీ
బుర్రకు బారరి కిప్పుడు ప్రభుం డెవడోరి పురాణయోగి క
న్నెర్రలుసేయకుండ మఱి యీనవఖండములెక్క చూడుమీ.
(నిష్క్రమించును)

సత్యా—చూచారా? త్రాగి తందనాలాడి యెట్లా పాడైపోతున్నాడో.

దేవు—అల్క స్నేహాలు పట్టించతర్వాత మరెట్లా తయారవుతా డనుకొన్నావు?

డాక్ట—ఆ పోకిరీప్రజల్లోబడి యింకా చాలా పెద్ద పెద్దవే నేర్చుకున్నాడు. అయితే రేపటికేసులో పృధ్వీపతి

గారు మిమ్మల్ని సాక్షులుగా పెట్టుకొన్నారు. తప్పకుండా దయచేయాలి.

దేవు—మాపృథ్వీపతికి సాక్షులుగా వుండటంకంటే ఇంకేం కావాలి? తప్పకవచ్చి చెబుతాం.

డాక్ట—సరే సాయంత్రం వొకపర్యాయం దేవిడీకి రండి. వస్తా (నిష్క్రి)

దేవు—నాయనా! సత్యాగ్రహీ! నీ వొక్కడివే నా పేరు నిలపెట్టాలి. ఈ తాగ్రుబోతులకు దైవమూ అక్కర్లేదు ధర్మమూ అక్కర్లేదు. మీ అమ్మా నేనూ ఇహ నీ చేతుల్లోనే బ్రతకాలి. ఇంకా దురాగ్రహీవల్ల ఆశ లేమీ లేవు.

సత్యా—తండ్రీ! నీకష్టంతో బ్రతుకుతున్న మేము ని న్నెట్లా మఱచిపోగలం?

ఉ. తోటకుఁ దోటమాలివయి దూకులుపూకెడి వేటకాడవై
కాటక మేమిరాని సుఖకాపురమేలెడి చక్రవర్తివై
నూటికి నూరుపాళ్లు ప్రజనోటికి నాలుకవైన దైవమా!
ఏటికి చింత? నీ కొడుకు లింత కృతజ్ఞతఁ జూపకుందురా?

భూదేవి ప్రవేశం

భూదే—దైవమా! క్షమించాలి.

దేవు— ఏమిటి? ఇట్లా వొంటరిగా వచ్చావు?

భూదే—బిడ్డల్ని పొట్టపెట్టుకొంటున్నారని వచ్చాను.

దేవు—ఎవరిబిడ్డల్ని?

భూదే—ఈ భూదేవిబిడ్డల్ని

దేవు—నా కర్థంకావటం లేదు నీ వంటున్నది.

భూదే—ఎందు కర్ధమౌతుందీ? దయారసముంటే అవుతుంది.

సత్యా—ప్రిజల్నేనా పోట్టపెట్టుకొంటున్నది?

దేవు—ప్రిజల్నేనా మాటి?

భూదే—ప్రిజల్ని గాక ఇం కెవర్ని?

దేవు—భూదేవి! నీవు వట్టి అమాయకపుదానవు. ప్రిజలు దుర్మార్గులైనప్పుడు ప్రిభువు శిక్షించాలి.

భూదే—ప్రిభువు దుర్మార్గుడైనప్పుడో?

దేవు—దైవబలమూ, ధర్మబలమూ నన్నగిల్లుతే.

భూదే—ఈ రెండూ నన్నగిల్లినంతమాత్రాన చక్రవర్తికి బుద్దెట్లా వస్తుంది?

సత్యా—ఎట్లా వస్తుందో నీవే చూస్తావుగాని, అయితే మావల్ల కావల్సిన సహాయ మేమిటి?

భూదే—మీ రెవరూ ప్రిభువుతరఫున సాక్ష్యం చెప్పకుండా వుండటమే కావాలి.

సత్యా—అది మావల్ల కాదు.

భూదే—ఏంచేత?

దేవు—రాజ్యభారాన్ని ప్రిభువు మోస్తున్నప్పుడు, ఏంసహాయం చేయవల్సి వచ్చినా మాబోంట్లు చేయాలి.

భూదే—దైవమా! నీవుకూడా ప్రిజల్లోవున్న కష్టాన్ని ధర్మాన్ని గుర్తించలేవా?

ఉ. కండలుకర్గి కాలువలుకట్టెకి రక్తముచేత నెన్నిమో
పండినపంట లన్నియు, దివాణములోనికి దోలి నీకు భూ

మండలిపైన భూపతికి మానము ప్రాణము నిల్పి, పస్తులకా బండినబిడ్డలకా నరకవచ్చెదనయ్యా! కిరాతదైవమా!

సత్యా—(ఆగ్రహముతో) ఓసి. క్రూరురాలా! చాలు నీవాగుడు కట్టిపెట్టు. ఇల్లు కదలగూడని ఆడదానవైయుండి సిగ్గు విడచి యీమాదిరి మొగబడి, దైవనింద చేస్తున్న నీవంటి రాక్షసిజాతిని చూచి జాలిపడగూడదు. మూర్ఖురాల! ఇంత వఱకూ మాతృసమానురాలవని వూరుకొన్నాం. ఇహ నీ చేష్టలూ నీ బుద్ధులూ చూచి సహించలేం. ఈతక్షణమే నిన్నుగూడా పృథ్వీపతికి ఒప్పచెప్పితేగాని, ధర్మాలు నిల్వవు. కదలుము.

భూదే—స్వామి! మీరు సత్యాగ్రహులు, మీ కిట్లా దురాగ్రహము రాకూడదు. నన్నుగూడా నా బిడ్డలతోపాటు ప్రభువు కొప్పజెప్పుము. అంతకంటే నాక్కావలసినది లేదు.

(నిష్క్రమించు)

దేవు—ఆసి పదవే! ఆడదాని కింత ఆగ్రహం పనికి రాదు. నాయన సత్యాగ్రహి! దీనిసంగతి తప్పకుండా ప్రభువుకి చెప్పితీరాలి. రా వెళదాం. (నిష్క్రమింతురు.) (తెర)

2వ రంగం. సత్యాగ్రహి గది.

ముక్తికాంత కీర్తన పాడుకొంటు బియ్యము విసరుతూ వుండును.

కీర్తన—దేవతలారా! జీవిత మంతా
చీకటిమయమూ!
ఆకటిభయమూ ॥దేవ॥

దీనికి తోడూ! దీనికి గోడూ
తోవలు గలవా
తీరము గలదా ॥దేవ॥

భూదేవి ప్రవేశం

భూదే—అమ్మా! ముక్తికాంతా! మీఅక్క లేదా ఏమిటి?

ముక్తి—(లేచి) రండి! అత్తగారు! కూర్చోండి.

భూదే—అయితే! ముక్తికాంతా! ఎప్పుడొచ్చినా నీ అక్క శక్తికాంత కనిపించదేం?

ముక్తి--చదువుకొన్నవాళ్ళింటిదగ్గఉంటే యేంతోస్తుందండీ?

భూదే—తల్లీ! ముక్తికాంతా! మీ అత్తగారంటున్నట్లు నీ వొక పిచ్చిబాగుల పిల్లవి. అంచేతనే శక్తికాంత నీచేత అడ్డమైన చాకిరీ చేయిస్తున్నది.

ముక్తి—అదేమిట్లేండి. అదృష్టంకొద్దీ ఆడది సుఖపడుతుంది. ఇంతకూ నాకు చదువువచ్చే గీతలేదుకాబట్టే చాకిరీ రాత పట్టింది.

భూదే—అయితే! శక్తికాంత చదువు సంసారాల్ని బాగుచేస్తున్నది లే.

ముక్తి—అదేమిటండి. ఆమె అడుగుపెట్టిననాటినుంచి ఇల్లు బంగారపు గనైంది.

భూదే—అవుతుంది. ఎందుకాకూడదు. ఎవరిల్లనా గుండవేస్తుంటే అంతా బంగారపుదిబ్బే పెరుగుతుంది. నీకింకా తెలియటంలేదుకాని బోలు నీఅక్క తెలివితేటలు.

ముక్తి—నాకేం తెలియవండి నిజంగా.

భూదే—అయితే విను. డాక్టరుగారి స్నేహం పట్టింది.

ముక్తి—అందుకా రోజూ జబ్బుచేసినట్లు డాక్టరుగారింటికి వెళుతున్నది.

భూదే—ఈమె స్నేహం మరిగిననాటినుంచీ డాక్టరుగారు పెళ్లాంబిడ్డల్ని విడిచిపెట్టి సంపాదనంతా యీమెకి ధారపోస్తున్నాడు.

ముక్తి—పాపం ఆ డాక్టరుగారి సంసారం ఎంత ఘోషిల్లుతున్నదో

భూదే—ఘోషిల్లటమే యేమిటి? నానాబాధలు పడుతున్నారు. ఇంకా ఈ శక్తికాంత నా కాపురంగూడా పాడు చేయటానికి పన్నాగాలు పన్నుతున్నదని వింటున్నాను.

ముక్తి—అయ్యో! అయ్యో! మీ కాపురానిగ్గూడా యీ పాపన్నంటిస్తున్న దన్నమాట. మా మామగార్కి చెబుతాలెండి.

భూదే—మీ మామగారు వెఱ్ఱిదేవుడు. ఎవరేది చెప్పినా వినటం బాగా అలవాటైంది. పైగా యీ వెఱ్ఱి దేవుణ్ణి పారిధనలుచేసి, సమారాధనలు చేసి, ఎవరుపడితే వారు కట్టేసుకొంటున్నారు. ఆయనకి చెప్పినా ప్రయోజనం లేదు. చెవికెక్కవు. మొన్న మీ పినమామగారు ప్రజల్ని నానాశిక్షలు వేసి వేధించబోతున్నారని చెబితే, మా మ్మాట వినిపించుకోకపోగా తండ్రీ కొడుకులూ కలిసి నామీద మండి పడ్డారు.

ము క్తి—మావారూ అంతే నిజం తెలుసుకోకుండా మోసగాళ్ళని నమ్మి అయోమయంలో బడిపోతూవుంటారు.

భూదే-ఆ వెర్రిదేవునిపోలిక ఈ సత్యాగ్రహి కొచ్చింది.

ము క్తి—తండ్రిపోలిక ఎవరికో వొకరికి రాకుండా వుంటే ఎట్లా?

దూరంగా జగన్మాత ప్రవేశం

జగ—ఒసే! ము క్తీ! నీకెప్పుడూ పాడుముచ్చట్లేతప్ప పనీ పాటా చూచుకోటం లేదుగా.

ము క్తి—పిండి విసురుతున్నానండి. చిన్న త్తగారొస్తే యిప్పుడే మాట్లాడించాను.

జగ—వాళ్ళకేం. రాణివాసస్త్రీలు. దాసదాసీజనం చేత చాకిరీలు చేయించుకొంటారు. ఆ రాజరికాలు మనకెట్లా వస్తై?

భూదే—నేనూ ఇప్పుడే వచ్చాను అక్కగారు!

జగ—వస్తే వచ్చావులే. నిన్నిప్పుడేం అనటంలేదమ్మా తల్లీ! కూర్చో! ఏంపనిమీద వచ్చావు?

ము క్తి—(పిండి విసురుతూ) శ క్తికాంతవల్ల యెంతకథ లేచిందో వారు చెబుతారు కాస్త వినండి.

జగ—వారూ చెప్పక్కర్లేదు, నీవూ చెప్పక్కర్లేదు. నీపని నీవు చూచుకొందూ. ఏం భూదేవమ్మా! శ క్తికాంత మీ దివాణంలోకొచ్చిందా?

భూదే—జగన్మాతా! ఎంతపూజచేసి యిటువంటి కోడల్ని తెచ్చిపెట్టుకొన్నావోగాని, యెన్నెన్నికొంపలు గుండాలు వేస్తున్నదో చూస్తున్నారా?

జగ—నాకేం తెలియదు తల్లీ! ఏమిటి?

భూదే—డాక్టరుగారితో పికార్లేమిటండి?

జగ--ఏమిటో అమ్మా! పాడైనచదువులొచ్చింతర్వాత పికార్లురాక మఠేమొస్తె మావాణ్ణెందుకూ పనికిరాకుండా కట్టేసి, తా నింటింటా తైతక్కలాడుతున్నదికాఁబోలు.

భూదే—ఏ తైతక్కలాడితే యేంలెండి. సంపాదనలో బడ్డది.

జగ—అదిమట్టుకు నిజమే లేతల్లీ. ఆపిల్ల ఎంత విఱచుకు పడి విచ్చలవిడిగా తిరుగుతున్నా చూస్తూ వూరుకొంటున్నది దాన్ని చూచుకొనే.

భూదే—(ఉత్తరం తీసి) సరేలెండి. మీకొచ్చిపడు తున్న ఐశ్వర్యాన్ని చూచుకొని మీరు మురిసిపడుతుంటే లోకంలో ఎన్ని సంసారాలు కాలిపోతున్నయ్యో మీకెట్లా తెలుస్తుంది?

జగ—(ఉత్తరం చూపు) అదేమిటమ్మా! నాయింటి మీందకి దండూరాకొచ్చావా ఏం?

భూదే—నేనేమీ దండూరాకి వచ్చేదాన్ని కాను. కాస్త యీ వుత్తరం వినండి తెలుస్తుంది. (ఉత్తరం చదువును) శ్రీ శ్రీ సుందర సుకుమార సార్వభౌములైన పృథ్వీ పతిగారికి మీ ప్రేమువనలక్ష్మి శక్తికాంత చేయు విజ్ఞప్తి.

జగ—అయితే భూదేవమ్మా! నీకావుత్తరం ఎక్కడ దొరికింది.

భూదే---ఇక్కడే దొరికింది, ఇంకెక్కడదొరుకుతుంది?

ముక్తి—అక్కపుస్తకంలో వున్న వుత్తరం.

మాసుడుగా శక్తికాంత ప్రవేశం

శక్తి—ఒసే! ముక్తీ! నాబల్లమీాద పుస్తకం తీశావా నీవు?

ముక్తి—అదిగో నేనేం తీయలేదు. భూదేవిఅత్తగారి దగ్గఉంది.

శక్తి—(అమాంతంగా భూదేవిదగ్గరున్న పుస్తకాన్ని వృత్తాన్ని లాక్కొని, ఉత్తరాన్ని చించి) అనవసరం మా యింటికి రావద్దని మా మామగారూ! మా మఱదీ నీకు నిన్న బుద్ధిచెబితే మళ్ళీ ఎందుకొచ్చావిక్కడికి?

జగ—అదేమిటే! నీ గయ్యాళితనమూ, నీవునూ, అట్లా ఎగబడి కొట్లాడతావ్?

శక్తి—చాల్లెండి. మిమ్మల్నేం అనలేదు. ఇట్లా ఈ భూదేవి సంసారాల్ని పొట్టపెట్టుకొంటుంటే చూస్తూ వూరు కోరు. నోరు మూసుకోరు.

గీ. ఇంతవఱ కెందరెందరయిరొ తెలియదె
పట్టుకొని కట్టుకొని నీవు పుట్టిముంచి
ఆలిబిడ్డల మెడ కోయజాలినావొ
దిక్కుమాలిన భూదేవి! చిక్కితింక

(నిష్క్రమించు)

జగ—ఆసి గడేగాడిదాన! ఎంత విఱ్ఱవీగి విఱచుకొని పడుతున్నావే! ఇంకా నీవల్ల కొంపలు ముట్టుకొని తగలబడేట్టె వున్నై. మాకున్నగోల చాలుగానీ ఓ భూదేవమ్మతల్లీ! ఇంకా మమ్మెందుకు రచ్చకీడ్పిస్తావు? తర్లు తర్లు.

భూదే—నేనేంచేశానండి.

జగ—ఇంతకంటే యేంచేయాలి? మాతల్లో! ఎన్నడు యింతగోల పడ్డవాళ్ళం గాముకాని. తల్లు తల్లి!

భూదే—వెళతాలెండి. మీయింట్లో వుందామని రాలేదు నేను. (నిష్క్రమించు)

జగ—ఏమ్! ముక్తికాంతా! నీకు నేనుచెప్పిన పనేమిటి? నీవు చేస్తున్న రాచకార్యాలేమిటి? ఇందుకేగాదు మావాడు అనేది.

ముక్తి—నే నేరాచకార్యాల్నెఱగ నత్తగారు!

జగ—ఎఱుగవులే, నీవేమెఱుగవు. ఎట్లాగైతేం ఉత్తమ యిల్లాలి వొచ్చిపడ్డావ్. అయితే! నీ వెప్పుడింకా ఈ 4 కుంచాలగింజలూ విసుర్తావే? ఆసి నీపని మంటిగడ్డలైపోనూ. బాగానేవుంది నీ విసరటమూ నీవునూ. ఇదిగో! ఇంతకు ముందు జరిగిన గోల రెండోచెవిలో పడగూడదుసుమా. పడితేమట్టుకు నీవేగాదు, నీతోబాటు కొంపగూడా లేచిపోతుంది. జాగ్రత్త. ఆసి పెత్తేగొడ్డా నేను నీఅంతప్పుడు నే నెంతపని చేస్తుండేదాన్ని. ఇట్లా మందగుదిపని నేనెప్పుడూ ఎఱుగను. కానియ్యి తొందరగా (నిష్క్రమించు)

ముక్తి—(విసరుతూ) ఒక్కనాడూ సుఖంగా పొద్దుబుచ్చుకొందామంటే వీల్లేకుండాపోయింది. ఈ పాపిష్టిసంసారంలో సుఖంలేదని మామగారందుకనే చెబుతూవుంటారు. అందులో ఆడజన్మకసలే సుఖంలేదు. ఇందుకే ఆడదైపుట్టటం దానికంటే అడవిలో మ్రానై పుట్టడం చాలా మెఱుగంటారు. రామయ్యతండ్రీ! రామయ్యతండ్రీ!

గీ॥ ఎందుకీజన్మ? యీ చెడుబొందిలోన
మురిగిమురిగి పురుగులెన్నొ పుట్టి పుట్టి
చెడుగవులుకొట్టి పోయెడి జీవులయ్యొ
దేనికింత తీపి మహాత్మ! దీనిపైన

సత్యాగ్రహి పరివేశం

సత్యా—ముక్తీ! నీవుకూడా సాక్ష్యం చెప్పాలి.

ముక్తి...(లేచి) సాక్ష్యమేమిటి నేనేమీ యెఱుగను.

సత్యా—అదిగాదోయ్! నీకేం తెలియకపోయినా మేమేమి చెబుతామొ అదే చెప్పాలి.

ముక్తి—ఎవరిమీద.

సత్యా---హాలాహలంమీద, ఇంకా కొంతమందిమీద

ముక్తి—దీనివల్ల మనకి లాభమేమిటి?

సత్యా—మనరాజ్యం కాపాడుకొంటానికి.

ముక్తి—మనకి రాజ్యం లేదుగా.

సత్యా—మా బాబాయిగారికుంటే మనకున్నట్టుకాదా

ముక్తి—అవున్లెండి. మనకేమన్నా లాభముండా?

సత్యా—కావల్సినవన్నీ యిస్తారు. ఈ పిండేమిటి? ఈ విసరటమేమిటి?

ముక్తి...ఇది మీఅమ్మగారు పురమాయించిన పని.

సత్యా—సరే. అన్నంపెట్టు తొందరగా వెళ్ళాలి.

ముక్తి—పదండి (నిష్క్రమింతురు. తెరపడును)

3వ రంగము డాక్టర్ గృహం.

డాక్టర్—మాలా ప్రవేశం

డాక్ట—మాల్యా! నాకోసం దొరగారొస్తారేమో అర్జెంటు కేసు చూచిరావటాని కెళ్లారని చెప్పు.

మాలా—అచ్చా. జీ. థిర్గి హెప్డూ? హొత్తారూ హాండీ?

డాక్ట—సాయంత్రానికే వస్తా. రేపు వాయిదా వుందిగామఱి.

మాలా—మఱి నాకీగూడా సాచ్చం యివ్వాల్టాగదూ హండి?

డాక్ట—తప్పకుండా నీవు సాక్ష్యం చెప్పాలోయ్. సమయం వచ్చినప్పుడే సంపాదించుకోవాలి. వెళ్తా.

మాలా—అచ్ఛా బేగీరండీ బాబ్.

డాక్ట—సరే వెళ్తున్నాను. ఎవరెవరి కేమెడిసన్ని వ్వాలో గుర్తుందా?

మాలా—ఘుర్తూ లేకేమండీ.

డాక్ట—వస్తా. (మాలాకూడ వెళ్ళును.)

(డాక్టరు నిష్క్రమించును)

తిరిగి మాలా ప్రవేశం

మాలా—ఫెద్దా ఫెద్దాహోళ్ళ్కి స్నేహం ఫట్టాలీఘానీ సిన్నోళ్ళ్కి స్నేహంసేస్తే హేమ్టీ హొచ్చేదీహుందీ? ఫూటా కూగతీలేనీ ముట్టీమొహంనాయాళ్ళ్కి హెంటాహుంటే యీ సుఖం హెక్డా హుంటుందండి?

పృథ్వీపతి ప్రవేశం

పృథ్వీ—డాక్టరుగారున్నారా మాలా?

మాలా—(ఆదుర్దాగా) సలాం లేఖుం రాజాసాబ్.

పృథ్వీ—డాక్టరు గారున్నారా?

మాలా—హైజీ. ఫిల్సుకొస్తా భైటో బాబ్ (నిష్క్రి)

పృథ్వీ—ఇక్కడికింకా శక్తికాంత రాలేదేమిటో తెలియదు. త్వరగా వచ్చి నిరీక్షిస్తూ వుంటానని కబురుచేసింది. గా లేదేమబ్బా? ఈసంగతి దురాగ్రహి కంట బడినదేమో గ్రహచారం.

మాలా ప్రవేశం

మాలా—హిప్డే ఖార్క్ఫోయారూహాండి. అర్జెంటూ భేస్ హాకటాచ్చీ జాతేహై బాబ్.

పృథ్వీ—మళ్లీ ఎప్పటికొస్తారో తెలుసా?

మాలా—రేఫట్కే హాత్తారూహాండీ? రేపూ సాచ్ఛంగూడా హుందీఖమా బాబ్.

పృథ్వీ—అయితే శక్తికాంతగారింకా రాలేదేం? లెట రిచ్చావా?

మాలా—హీచ్చానూహాండీ. వచ్చే హేళాగూడా హైందీబాబ్.

పృథ్వీ—అయితే నీతో యేమన్నారు?

మాలా—హేమ్టిహాంటూరూహాండీ! మీకీ హింకా పానాల్ ధారాపోత్తానూ హన్నార్ బాబ్.

పృథ్వీ—ఎవరికీ తెలియకుండా జాగ్రత్తగా ఇచ్చావా!

మాలా—బమ్మాం దేముడ్కి ఘూడా తెలియద్ బాబ్ (చూచి) వార్లో హాంత్తుండార్.

పృధ్వీ—(ఫర్సులోంచి నోటు తీసి యిస్తూ) ఇదిగో! ఇది తీసుకో నిన్న మఱచిపోయి లే.

మాలా—(తీసుకొని సలాముచేసి) మీా పిల్లాజల్లా సల్లాగా హుండాల్ బాబ్.

పృధ్వీ—వాకిట్లో జాగ్రత్తగా వుంచు పో.

మాలా—హాట్లాగే బాబ్. (నిష్క్రమించు)

(సిగిరెట్టు పీలుస్తూ వుండును.)

షోకు చేసుకొని శక్తికాంత ప్రవేశం.

శక్తి—(చిఱునవ్వుతో) ఎంత సేపైంది తమరు దయ చేసి?

పృధ్వీ—అరగంటైంది.

శక్తి—ఆఫేనవర్రైందా? వచ్చి.

పృధ్వీ—అవును.

శక్తి—(ప్రక్క కుర్చీలో కూర్చుని) ఎప్పుడూ వెళ్లేది?

పృధ్వీ—ఎక్కడికి?

శక్తి—(సిగిరెట్టు ముట్టించి) అయిందీ మఱచిపోయి నారూ? ఇంతే మీా కేమీా జ్ఞాపకం ఉండదు. మీా అభయా లన్నీకూడా ఇంతే.

పృధ్వీ—ఇన్ని వ్యాపారాలున్నవాడి కెక్కడ జ్ఞాపకం వుంటుంది మీారే చెప్పండి.

శక్తి—నీలగిరికి.

పృధ్వీ—సమ్మర్ రానీయండి వెళ్దాం.

శక్తి—ఇప్పుడు నమ్మరులోనే పడ్డాం.

పృథ్వీ—అయితే రేపు వాయిదా వెళ్ళనీయండి వెళ్దాం.

శక్తి—మీారు నేనుచెప్పినట్టు చేయాలి.

పృథ్వీ—ఇంకా దేనికీ అభ్యంతరం వుండదు చెప్పు.

శక్తి—మన లెట రెట్లా భూదేవికళ్ళ బడిందోగాని, దాంతో కొంప ముట్టించింది.

పృథ్వీ—ఎప్పుడూ

శక్తి—నిన్ననే

పృథ్వీ—మీాయింటి కొచ్చిందా యేమిటి?

శక్తి—రావడమేగాదు. ఎంతఆగం లేపి వెళ్ళిందను కొన్నారు?

పృథ్వీ—అయితే యీా తక్షణమే దాన్ని వధించి తీరుతాను.

శక్తి—ఇది వట్టి ప్రగల్భాలు.

పృథ్వీ—కాదు. నీ కిచ్చిన అభయా లన్నింటికంటె ఇదే ముందు నెరవేర్చితీరుతా.

శక్తి—సరేగానీండి. రత్నహార మేది?

పృథ్వీ—మఱచిపోయాను తెస్తా.

శక్తి—(నవ్వి) ఇట్లాగే వుంటై మన అభయాలన్నీ.

పృథ్వీ—కా దిప్పుడే తెస్తా చూడు. (నిష్క్రమించు)

శక్తి—ఈ పురుషలోకానికున్న వెఱ్ఱి వర్ణించలేం. ఎంత తొందరపడతారో అంత జారిపడతారుకూడా. ఇహ ఈ భూదేవిగర్వ మేమిటో చూచితీరాలి. తనకు నేను చిక్కానని

కులికి మిడిసిపడుతున్నది. యీ అదిరిపాటుతనం నేటితోగాని బయటపడదు. మొదట నాతో పంతాలాడిన సత్యాగ్రహి కూడా మా ప్రభుపక్షానికే సాక్ష్యమీడాని కొస్తున్నాడు. వరల్డ్‌కి అగ్రికల్చెరెట్లా అవసరమో, జీవితానికట్లా కల్చెరు కూడా చాలా అవసరం. అది లేకుండా తా బట్టిన కుందేటికి మూడేకాళ్ళని కూర్చోరాదు. ప్రతి విషయంలోనూ ప్రతి వారూ దీన్ని చాలా జ్ఞాపకం వుంచుకోవాలి.

డాక్టరు ప్రవేశం

శక్తి—హలో మై డియర్ డాక్టర్

డాక్ట—హలో హలో మై డియర్ శక్తికాంత! ఎంత సేపైం దొచ్చి?

శక్తి—ఇంతకుముందే వచ్చాను. ఊరు వెళ్ళలేదేం?

డాక్ట—కారందలేదు. రేపు వాయిదా వెళ్ళింతర్వాత వెళ్తా.

(డాక్టరూ, శక్తికాంత ఒకరికొకరు సిగిరెట్లు ముట్టించుకొని)

శక్తి—(నవ్వి) టూడే మీకూ, మాకూ ఎన్ని పాయింట్లు తేడా సార్?

డాక్ట—ఇవాళ్ల మీదే పైచెయ్యి.

శక్తి—రేపూ మాదే!

డాక్ట—ఎందుకింత మురిసిపడతారుగానీండి. ఈపరుగు కొన్నాళ్ళదాకాలే.

శక్తి—(నవ్వి) అయితే విూ పరు గెప్పుడు?

డాక్ట—చెబుతాగానీ, అయితే స్నీక్సులో గురువుని నేనేగా మటి?

మ. గురుకట్నం బిక ఏమి యిత్తువె! కళాకోటీరమాణిక్య సుం
దర సుస్నిగ్ధమయూఖ రేఖ! వనసంధ్యాలక్ష్మి! ముత్యాలతో
ల్కరికంటెన్, కడు చల్లచల్లని తరంగాలై మనోజ్ఞంబులై
కరవున్ దీటగ కమ్మకమ్మనివి తకన్ వీడు గైకోడటే.

శక్తి—(నవ్వి) మఱి కమ్మకమ్మనివంటే; కమ్మకమ్మగా పెట్టేవేనా!

డాక్ట—అవి కాదూ, (ముద్దుపెట్టుకొనబోతూ) ఇవి.

శక్తి—చాల్లేద్దురూ, వట్టి ముద్దుల్లో ఏపసా లేదు.

డాక్ట—ఏపసా లేకపోవట మేమిటి?

ఉ. ఈ ముసినవ్వు ముద్దులుగదే! యిటువంటి విశాలసౌఖ్యల
క్ష్మీమణి చిత్రశాల నగిషీలను జెక్కుచుఁ గట్టుచుండె; నేఁ
డీ మృదుమాధురీ కుసుమహేమ పరీమళమైన ముద్దులో
నోములిఁకెన్ని పండునో; మనోహరి గైకొని చూడరాదటే?

(ముద్దుపెట్టుకొనబోవును)

శక్తి—(లేచి) ముద్దులు హద్దులు మీఁరుతున్నై.

డాక్ట—(లేచి వినయంగా) నే నేమన్నాను?

(దగ్గఱికి వచ్చును)

శక్తి—(మొహం చిట్లించి) దూరంగా వుండండి.

డాక్ట—(దీనంగా) ఇంకా దూరమే?

శక్తి—ఔను. ఏమీ లేకుండా ఏమి టిది?

డాక్ట—(పెద్దమొహం చేసుకొని) ఏం కావాలి?

శక్తి—సిగ్గు.

డాక్ట—సిగ్గే! అ దిప్పుడు వచ్చే దెట్లా?

ఉ. ఈ విరహజ్వరానికి మఱెవ్వరు వైద్యులు నీవుదక్క-? నా
కీ విరజాజిపువ్వు లొలికించెడి వెన్నెలపాలవెల్లి కె
మ్మోవి సుధారసమ్ము మునుముందుగ ఔషధభంగి నిచ్చి,నా
జీవములింక నిల్పగదె? చిన్నివరాల సువర్ణవల్లరీ!

(ముద్దుపెట్టుకొనబోవును)

శక్తి—(తొలిగి) ఓహో! పిచ్చికింద మారుతున్నది.

డాక్ట—ఇట్లా నీవు నిరాకరిస్తే ఇహ పిచ్చిలోకే మారుతుంది.

శక్తి—పైగా ఈపిచ్చి నయం చేసుకోటానికి ఎంత కావాలో తెలుసుకొన్నావా?

డాక్ట—ఎంతకావాల్సినా మనకేం ఫరవా లేదు.

శక్తి—ఇంతవెట్టి ఎంతోసే పుండదు.

డాక్ట—అట్లా అనక. ఎల్లకాలం వుంటుంది.

శక్తి—ఉంటే, అన్నిపరీక్షలకీ నిలవాలి.

డాక్ట—నిలుస్తా.

శక్తి—అదీ చూస్తా.

డాక్ట—దివాలాకావటానికి మన కిప్పు డేమీ లోటు లేదు. ఎందు కిట్లా పరీక్షిస్తావు?

సీ. కాఱువినీలమేఘపు కెరటాలుగా
నీ ముంగురులు రేగి నిగ్గులిడగ
కాదంబినీమధ్య సౌదామినీరీతి
నీమోము విలసిల్లి నీటు నిడగ
పసిఁడి గులాబిరెబ్బలవోలె మెత్తని
నీదు చెక్కిళ్ళు పెన్నిధుల నిడగ

మృదుమధుర కరుణామృత మొలికించెడి
నీచూడ్కి కిరణాలు గాచుచుండ

సీ. ఏమి తక్కువ నాకు నా కోమలాంగి
శుభమనోహర పూజాప్రసూనపేర్మి
పరిమళము విరాజిల్లు కాపురములోన
బాధ లనిపించ వగచాట్లు వచ్చిపడిన.

శక్తి—ఇదే పిచ్చంటారు.

డాక్ట—ఈపిచ్చిలో ఎంతకష్టం వున్నదో అంతఅదృష్టం వుందని తెలిసికూడా బాధపడటం ఎందుకు? (దగ్గఱకు వచ్చి) ఇదిగో!

శక్తి—సరేగానీండి. నాకు తెలుసు మీఒడుపు.

ఉ. వేసము లెన్ని వేసి బులిపించిన కన్గొనలేకపోను నీ
కోసము వాచివాచి పడగూడని పాట్లనుబడ్డ, మోవి కీ
మీసము లడ్డుగాదె? మిడిమేలము లడ్డము లెన్ని యున్నవో
తీసి, మనోజ్ఞరాగమును దీసి, మనోహర! వీనెమీటుమీ.

(తెరలోంచి మాలాసాహెబ్)

(అజే! డాక్టర్ సాబ్! దురాగ్రహి ఆయా ఆయా)

శక్తి—(భయంతో) పోతా (లేచును)

డాక్ట—(చేయి పట్టుకొని) ఏంఫరవాలేదు కూర్చో.

శక్తి—(నోటిమీద చేయిపెట్టుకొని) అరుస్తారేమిటట్లా

డాక్ట—అరుస్తా వేమి టట్లా?

శక్తి—బాగానేవుంది. ఏమిటండీ చెబుతుంటేనూ?

డాక్ట—ప్లేటు మారుస్తాలే.

శక్తి—ఇహ మీ రేమీ మార్చవద్దు. మాట్లాడకండి.

డాక్ట—సరేలే. ఏమీ మాట్లాడకుండా వుంటే ఏమి అనుమానం పడతాడో కొంపదీసి.

శక్తి—అయితే యింకో గ్లాసు పోస్తాను. పిండి.

(మాలా సాహెబు బయటనుంచి జీ! జీ! ఆయా ఆయా)

శక్తి—(నవ్వుతూ) మాలాకి మంచి నౌఖరే దొరికింది.

డాక్ట—ఏంచేస్తాడు మరి? నల్గురిబిడ్డల్ని బ్రతికించు కోవాలి.

శక్తి—సరేలెండి. వారివా ళ్లెన్నిపాయింట్లలో వెనక బడ్డారు?

డాక్ట—అట్లా అడుగు చెబుతా.

దురాగ్రహి ప్రవేశం

డాక్ట—(లేచి) హాలో మిష్టర్! దురాగ్రహి! అంటుం డగానే వచ్చారే!

దురా—(నవ్వి) అంటివున్నంతలోనే రావల్సివచ్చింది

డాక్ట—(తెల్లబోయి) అంటే?

శక్తి—అంటే కోమటికొత్తబెల్లం.

దురా—(నవ్వి) భలే అదీ! కొత్తదిరుచి.

(మాలా విస్కీబుడ్లు తెచ్చి పెట్టును.)

డాక్ట—(దురాగ్రహి కిస్తూ) కొంచెమిది పుచ్చుకోండి.

దురా—మీరేం పుచ్చుకొంటారు?

(మిగతావారుగూడా పుచ్చుకొంటారు)

మాలా—హోర్క ఖోత్తాఖోత్తాదాన్కి పుచ్చు కొంటార్.

దురా—(బుడ్డీ పుచ్చుకొని) ఔను. ఏనిమిషానికా నిమిషం ఏరోజుకారోజు కొత్తనాజూకులు లేస్తుంటేగాని అన్నీ గరంగరంగా ఉండవుగామరీ? (తాగి) అంచేత ప్రతిదానికీ మార్పులు రావాలి. మై డియర్ డాక్టర్! అసలు లోలో గూడా న్యూలా రావాలి. నాన్సెన్స్, ఈ తాతలనాటి మారేజీలు మారితేతప్ప జగత్తుకి సుఖం లేదు.

శక్తి—అప్పుడుగూడా ముసలవాళ్ళముందు పడున్న వాళ్ళకి సుఖం లే దనుకొంటా.

దురా—నీ కింకా అన్డర్ స్టాండ్ కాలేదు శక్తీ! కొత్తనీరొచ్చినప్పుడు పాతనీ రుంటుందా?

డాక్ట—ఎక్కడికీ పోదు. కలిసిపోతుంది.

దురా—అప్పుడు తెలిసిపోతుంది కామా?

శక్తి—తెలియటమే? ఏమిటి? ముతకాముక్కా అంతా బయటపడుతుంది.

దురా—శక్తీ! ముసలవాళ్లంటే అసలు మనకి పడదుగా. అయితే! మన మొహాన ముసలవతారం పడకుండా చూచుకోవట మెట్లా?

మ. ఇదిగో! నీదు గులాబిబుగ్గలకు తన్వీ! ఎంత సౌందర్యసం
పద నేడున్నను రేపువాడవటె? సర్వస్వమ్ము నర్పించి యీ
మృదుమాధుర్యకళాప్రపంచ వనలక్ష్మిన్ సాధశుభ్రింపఁడే
పదవిన్ జేర్చినగూడ వాడును; స్వభావంబెన్నడున్ మారదే

(తూలును) నీవు నాకు ధర్మపన్నాగాలు చెప్పక పదా. తెలిసింది!

శక్తి—నిషాలో పడ్డట్టున్నారు. పట్టుకోండి.

డాక్టర్—(లేచి) ఇట్లా కూర్చోండి. (పట్టుకొనును)

దురా—అరే! డాక్టర్! నీలో చెడురోగం ప్రవేశించింది. ఏవైద్యానికీ ఈరోగం కుదరదు. ఇంకా నేను నీరోగం కుదురుస్తా వుండు. (తూలును)

శక్తి—పడతారేమొ పట్టుకోండి పాపం.

దురా—నన్నెవడ్రా పట్టుకొనేది? ఇట్లా మూలచేరి నీవంటి మూలవిరాట్టు లెంతమందో కనిపించకుండా దాక్కుంటున్నారు. ఈదెబ్బతో అందర్నీ నే నింకా పట్టుకోందే వదలిపెట్టను. తూలును (ఇద్దరూ పట్టుకొందురు)

డాక్టర్—మాట్లాడకండి కాసేపు.

రత్నహారం తీసుకొని పృథ్వీపతి ప్రవేశం

పృథ్వీ—(తెల్లబోయి) ఏమిటిది? డాక్టర్!

డాక్టర్—ఏముంది? నిషా ఎక్కింది.

దురా—ఎవడికిరా నిషా ఎక్కింది? మీ ఇద్దరికీ ఎక్కింది.

శక్తి—కాసేపు మీ రేమీ మాట్లాడకండి.

పృథ్వీ—మాట్లాడకుండా తీసికెళ్ళి లాకప్పుచేయుండి. నిషాగిషా అదే తగ్గుతుంది.

(తెర పడును)

# ఆ క లి మం ట

## పంచమాంకము



1వ రంగం జగన్మాత గృహం

ముక్తికాంత బియ్యంలో గడ్డలేరుచుండును.

శక్తికాంత హార్మనీమీద పాటపాడుచుండును.

కీర్తన

మురళీధరా! మురిపించరా
మృదుగానసుధారస వాహిని
సుకుమారకథా సురమోహిని
పులకింపఁగా తిలకింపగా ॥ముర॥

శక్తి—నవయుగపిక్చర్స్‌వారి పాటల్లో నాజూకూ సుఖం పూర్వయుగాల పిక్చర్స్‌లో ఎంత గాలించిచూచినా దొరకదు.

ముక్తి—ఎవరిపిచ్చి వారి కానందం. ఈకాలపు పిక్చర్స్‌లో నాజూ కేమిటో నాకేం కనిపించటంలేదు.

శక్తి—గుడ్డివిశ్వాసా లుంటే యెట్లా కనిపిస్తై?

ముక్తి—కొత్తొకవింత పాతొకరోత.

జగన్మాత దూకుడుగా ప్రవేశం

జగ—అయితే ఎంత మొత్తుకొన్నా వినపడదరా?! దానమ్మకడుపు బంగారమైపోతేను.

ము క్తి—(లేచి) ఎందుకం డత్తగారు?

జగ—ఎందుకా! మమ్మల్నేమన్నా పిండాకూడు వొండుకు తిన్నిచ్చేదుందా కొంపలో?

శక్తి—(నవ్వుతూ) ఎవరొద్దన్నారు? తినండి.

జగ—ఏముంది! ఎక్కిరించటం చేతైంతర్వాత? ఆవ రసన చద్దన్నపుకరుళ్ళు పడుంటే ఎట్లా చావమంటారే?

శక్తి—చద్దన్నమే! అమ్మో! నా కరగదండోయ్!

జగ—ఆసి దానమ్మకడుపు బంగారమైపోను. అంత పచ్చికలైతే కాపరా లెట్లా చేస్తారే?

శక్తి—కాఫీలతో.

జగ—(పండ్లుకొరికి) అసలు గోడగడ్డలు అయిపోయ్యే గొప్పవాళ్ల సంబంధాలు చేసుకోటమే మాది బుద్ధితక్కువ. (ముక్తివంక చూచి) పదవేమే పిల్లా! నీక్కూడా అరగదా?

శక్తి—ఒసేయ్! ముక్తీ! చద్దన్నం తింటే మొద్దురాచ్చిప్పలైపోతారు. కాఫీ పెట్టుకొందాం రా.

ముక్తి—అమ్మో! కాఫీ నా కసలేపడదు.

జగ—నమ్మొ కట్టారటే? ఏవీ పడకపోవటానికి?

ముక్తి... కాదండి. చద్దన్నం తింటా నేను.

జగ—పదా, నడిమధ్యాహ్నం కావస్తున్నది. ఈవేళకి చద్దన్నాలే కాలేదు కొంపలో.

ముక్తి... నీవుకూడా రావే అక్కా.

జగ—ఆసి పదవే సిగ్గుమాలిన కట్టా

(నెట్టుకొని పోవును)

## దురాగ్రిహి ప్రివేశం

దురా—ఎక్కడికే ముక్తిని నెట్టుకుపోతున్నది?

శక్తి—ఎక్కడికా? చద్దన్నాల సమారాధనకి.

దురా—నీవు పోవేం?

శక్తి—మనం కాఫీసమారాధనకి పోతాం.

దురా—యస్. కాఫీసమారాధనలో వున్న మజా కాశీసమారాధనలోగూడా లేదు.

శక్తి—అది మీ అమ్మకి వినిపించండి.

దురా—ఆవిడికి కామన్సెన్సు లేదుగా?

శక్తి—మనకి లైసెన్సు లేదుగా?

దురా—అంచేతే ఫామిలీస్ సైలెన్సు లేదుగా?

శక్తి—సరేగానీండి గొడవ. ఏం తెచ్చారు?

దురా—కూరగాయలు.

శక్తి—ఊరగాయలుగూడా తీసుకురాకపొయ్యారు?

దురా—అవి తీసుకొస్తే మాఅమ్మ ఊరుకొంటుందా?

శక్తి—పోదురూ. మీ మాటలూ మీరూనూ? టిఫినేమన్నా తెచ్చారనుకొన్నా.

దురా—చెప్పావు కాదేం?

శక్తి—అదేమిటండి? రోజురోజూ చెప్పాలా యేం ప్రాణాలు నిల్పుకొంటానికి?

దురా—(నవ్వి) రోజు కాఫీ సేవించా లన్నమాట? దట్స్ గుడ్. తెస్తా.

శక్తి—తెస్తా తెస్తా అంటే ప్రాణాలాగవ్, వెళ్ళండి. మీ రొచ్చేలోపల స్టౌమీద కాఫీచేస్తా, త్వరగా రండి.

దురా—వెళుతున్నా సార్ (నిష్క్రమించు).

(శక్తికాంత కీర్తన పాడుకొంటు స్టౌ వెలిగించి కాఫీకాస్తూ, హార్మనీయం వాయిస్తూ వుండును)

కీర్తన

నవయుగ వాణీ, కువలయ రాణీ
అమృత పాణీ
సురుచిర వేణీ
కవికుల కల్యాణీ ॥నవ॥

జగన్మాత దూకుడుగా ప్రవేశం

జగ—నీ సంగీతం చట్టుబండలుగాను, కొంపలు తగల బడుతున్నా ఆపవటే?

శక్తి—(అదిరిపడి లేచి) అబ్బ! ఏమిటండి గోల?

జగ—గోలా—గోలకాదూ? గోలగానే వుంటుంది. ఏమిటా మటమీద ముట్టించావ్? కొంపేమన్నా బాగుపడా ల్నేనా?

శక్తి—కాఫీ పెట్టానండి.

జగ—కాఫీగాదు, కార్చిచ్చు పెట్టావ్.

శక్తి—ఊరకే గోలపెట్టకండి, అయింతర్వాత తీస్తారు

జగ—ఈ మటల్ని నీ వెక్కడ తీస్తావ్? కొంపంతా ఆరిపోందేగాని తీయవ్.

శక్తి—ఏమిటండి వొాకటే చాదస్తం, చెబుతుంటే.

జగ—అయింది, ఆసి నా తెల్వి మండిపోనూ; చాదస్తంకింద కట్టేశా?

శక్తి—ఆ... లేకపోతే యేమిటి చాదస్తం.

జగ—ఇదిగో చెబుతున్నా. అమ్మా! చాదస్తంగీదస్తం అన్నావంటే మట్టుకు.

శక్తి—(నవ్వుతూ) గీదస్తంకాదు. చాదస్తమే.

జగ—ఏముంది. సిగ్గా! శరమా? పెద్దంతరం, చిన్నం తరం లేకపోయింతర్వాత.

శక్తి—అవన్నీ మా కెందుగ్గాని, మీ కుంటే చాలు పొండి. ఎప్పుడూ ఏదోవొక తగాదా లేవదీసుకొస్తుంటారు పాడు.

జగ—నిన్న నేపనేముంది? మా అదృష్టంకొద్దీ మంచి దాన్నే తెచ్చి కట్టుకొన్నాడు.

శక్తి—ఎందు కొచ్చిన కష్టం? తెంచుకుపొమ్మనండి.

జగ—(నోటిమీద చేయిపెట్టుకొని) అయ్యో, అయ్యో, ఆసి గడేకారికట్టా! ఎంతమాటన్నావే, ఎంతమాటన్నావే. (కన్నీళ్లు తుడుచుకొంటూ) పోయి పోయి చివరికి మిగిలిన ఆ రెండుఫలాల్నీ కళ్ళలో పెట్టుకొని బ్రతుకుతున్నాం. నీనోట్లో పుండుపుట్టా, పుండుపుట్టాఅని. ఎంతనోరు పారేసుకొన్నావే? (పిల్లులు ఉట్టిమీద పాలకుండ పడదోసిన చప్పుడు విని) ఇష్షో ఇష్షో (దూకుడుగాపోతూ) ఈ యింటికే మొచ్చిపడిందో గాని మాయదారి పిల్లులతో బ్రతకలేకపోతున్నాం. ఇష్షో ఇషొ (అంటూ చూడకుండా స్టౌమీదపడి కాలు కాలి) చచ్చానే మాయదారి మేళం మాడిపోను. మాడిపోనూఅని. ఎప్పుడు ఈ మాయదారి ముఱలన్నీ మాడి మశానమై పోతయ్యోగాని, వీటితో చచ్చిపోతున్నారా భగవంతుడా!

శక్తి—(దగ్గఱ కొచ్చి) ఉండండి కాస్త. స్టౌగూడా విఱిగిపోయిందేమో.

జగ—ఆసి నీస్టౌలూ కాఫీలూ గడ్డలైపోను. కాలు కాలిపోయి నే నేడుస్తుంటే, నీసొమ్మంతా ఖాలిపోయిందని నీ వేడు.

ఫలహారాలు తీసుకొని దురాగ్రహి ప్రవేశం

దురా—సాగించారూ! రామరావణ యుద్ధం. ఫలహారాలు కానిచ్చి కానీయండి.

జగ—ఆరి నీ తెల్వి మండిపోను. ఈవరస ఇన్ని మాయదారి మఱలతో కాలుకాలి నే నేడుస్తుంటే, ఫలహారాలు చేసేదిట్రా? మీ ఫలహారాలూ మీరూ వూడ్చిపెట్టుకొనిపోను.

శక్తి—కాఫీకి కాఫీ నేలపాలైంది. ఇహ ఫలహారాలు గూడా వూడ్చిపెట్టుకొనిపోవాలి. అప్పుడుగాని మీ అమ్మ కళ్ళూ మీకళ్ళూ చల్లారవ్. ఎబ్బె! ఈగోల లేకుండా పోయినప్పుడే వస్తా, ఎందుకూ నాకేం అఖ్ఖర్లేదు.

జగ—లేచిపో. బెదరిస్తావా అమ్మీ? ఎవరిగోలా లేకుండా చూచి యీ మాయదారి మఱలతో కొంప నిలువునా ఆర్చిపోద్దామనుకొన్నావా మఱీ? చూచావట్రా సిగ్గులేని బలాదూరికట్టా. ఇటువంటిదాన్ని పెట్టుకొని కాపురమింకా యెట్లా వేగిస్తావురా?

దురా—అమ్మా!

జగ—అమ్మా లేదు దిమ్మా లేదు అవతలికిపో. నన్నాటే మండించక. (నిష్క్రమించును)

శక్తి—ఇంత గయ్యాళిగంపతో పాపం మీ నాన్నగా రెట్లా బ్రతుకుతున్నారోగాని, అబ్బ అబ్బ, రోజురోజూ, వాకిటే ప్రళయం. (ఫలహారం చేస్తూవుండును)

దురా—ఔను. ఇటువంటి జగన్మోహినితో రోజు రోజూ అబ్బ అబ్బ వాకటే మధురప్రణయం. బ్రహ్మ ప్రళయరి (ముద్దు పెట్టుకొనబోవును)

శక్తి—(విదళించుకొని) పోదురూ.

దురా—(పక్కన నవ్వి) ఎక్కడికి?

ఉ. స్నేహవిపంచికాస్ఫురితులు చేపెడి చక్కని చిన్నిచిన్ని నీ
మోహకళల్ గదే భువనమోహనగానవినూత్నరాగమై
నీ హితభాషిణిన్ గదలనీయవు; పొమ్మనమన్న నా జగ
న్మోహిని! యింక నెచ్చటికి పోదునె? పోయిన ప్రాణినిల్చునే.
(ముద్దుపెట్టుకొనబోవును)

శక్తి—అబ్బ! చాల్లెండి పేర్మ.

గీ. తియ్యతియ్యని యీ తీపి తెరలవెనుక
ఏమి వేషాలిక తయారయినవోగాని
లేచిపోకుండ ప్రాణి నిల్పితిరి యింక
నక్కినక్కావిదయ్యాల మొక్కబడికి.

కట్లు కట్టుకొని జగన్మాత ప్రవేశం

జగ—ఆరి నీ తెల్వి మండిపోను. ఈవరస ఆడదాన్ని ముందేసుకొని కూర్చుంటే దరిద్రం తలెక్కి కూర్చోదటా?

శక్తి—ఎప్పుడూ ఏవో దరిద్రాలూ, చిద్రాలూ కొంపలో (వంకెనున్న బాటు తీసుకొని) క్లబ్‌కి పోతున్నాసార్.
(నిష్క్రమించు)

జగ—ఆసి గడేకారికట్లా! ఇట్లా మగరాయుడవై పోయింతర్వాత నువ్వేం కాపురంచేస్తావే? చూడా్రి! సిగ్గులేని వాడా! అయిందా శాస్తి? ఇటువంటిదాన్ని కట్టుకొన్నతర్వాత నువ్వెప్పుడు సుఖపడ్డావ్? మమ్మల్నేం సుఖపెట్టావ్? (కన్నీళ్లు తుడుచుకొని) ఈవరస కాలుకాలి యేడుస్తుంటే యెట్లా లేచిపోయిందో చూస్తున్నావా? చూస్తున్నావా అంట.

దురా—ఏం చేయమన్నావే గోల?

జగ—ఏం చేస్తావ్, ఎత్తుభారం పొయ్యిలో బూడిదా? గోలైపోతే నేను.

దురా—ఎక్కడికీ పోదే?

జగ—అదేమిటా్రి! భైస్కూలెక్కి బజారునపడితే.

దురా—కళ్లుబ్బు కెళ్ళిందే! (ఫలహారాలు తింటూ)

జగ—కళ్లుబ్బకాడు. గోడగడ్డల కెళ్ళింది. అగికాదూ. ఏనాడన్నా మేమిట్లా లేచిపోయినాముటా్రి, (కూర్చుని) నాకీ గాయాలు మానవు. రామయ్యతండ్రీ్రి! నీకన్నా దయరాదా? అబ్బ, అబ్బ, బ్రితకలేనా్రి తండ్రీ్రి! (పండ్లుకొరుక్కొని) ఈ మాయదారి కాపురం చెట్టుబొగ్గులైపోతేగాని, వీళ్లకింకా హాయిగావుండదు. ఇహ ఈ పుట్కా వాతరోగంలోకి దించేట్లేవున్నై. అప్పుడుగాని వీళ్లకళ్ళు ఖాలిపోవు

దురా—ఎందుకే ఏమిటో తిట్టుకొంటావ్? ఎందుకో చెప్పరాదూ?

జగ—చెబితే చేసిచచ్చేవాళ్లెవరూ?

దేవుడు పరివేశం

దేవు—దీనిదుంప దీంతో తెగ. ఎప్పుడూ ఎందుకో అందుకు ఏడ్పు రాగాలుపెడుతునే వుంటుంది, ఇంటికిరావడమే భయమైతే.

జగ—దబ్బునే వచ్చారూ?

దేవు—సరేలే, నే నెక్కడికీ చావలా. ఏమిటాకట్లు?

జగ—మీారు తెచ్చిపెట్టినవే.

దురా—కాదే నాన్నా! స్టామీాదపడితే కాలుకాలింది

దేవు—ఇంతేకదా. దానికి వళ్లంతా కాల్చుకోట మెందుకు?

జగ—ఎందుకా? బ్రతక లేక.

దేవు—ఏంతక్కువైందని?

జగ—ఏంతక్కువైందా? ముక్కుమీాద వేలువేసుకొని వూారల్లపాదిజనం నవ్వటం తక్కువైంది. ఏముంది! అటువంటివాళ్లని తెచ్చిపెట్టుకొన్నారు.

దేవు—నీదుంపతెగ. పూటపూటా తిన్నది వంటబట్టి కొట్టుకోటంకాకపోతే ఏమిటది? పరాయిపిల్లలని దయాదాక్షిణ్యం వుండొద్దూ? రోజూ వాళ్లమీాదపడి యేడుస్తా వెందుకు?

జగ—ఇంకాయేం ఏయేడ్పూ చెవిని బడదులెండి. పోతున్నా.

దేవు—పో. పోవే.

జగ—పోతున్నాగా, పోయిందాన్ని వస్తానా!

దేవు—మళ్లీ రావడ మెందుకే. పో.

జగ—(కన్నీళ్ళు తుడుచుకొని) ఇంటిల్లపాదికీ, నేనం టేనే గిట్టనప్పుడు నేనుమట్టు కెందు కుండాలి?

దేవు—ఎవ డుండమని యేడ్చాడు? పో.

జగ—అబ్బా! అబ్బా! ప్రాణం పోతున్నది.

(పడిపోవును)

దురా—డాక్టర్ని పిల్చుకొని రానా?

దేవు—ఏమక్ఖర్లేదురా! తీపరమా! బాగానే వుంది.

జగ—నాన్నా! దురాగ్రహీ!

దురా—ఇక్కడే వున్నా నమ్మా!

జగ—సత్యాగ్రహిని చూడాలని వుంది.

దురా—ఇదేమిటే నాన్నా! ఇట్లా అంటున్నది? డాక్టర్ని తీసుకొస్తా. (నిష్క్రమించును)

జగ—నాన్నా! దురాగ్రహీ, సత్యాగ్రహీ వచ్చాడా?

దేవు—వస్తాడ్లే అరవక.

ముక్తికాంత ప్రవేశం.

ముక్తి—ఏమిటండి మామగారు! (కాళ్లదగ్గఱ నిలబడి)

దేవు—ఏముంది. మీ అత్తకి ఏదో నడమంత్రపు రోగం పుట్టుకొచ్చింది.

ముక్తి—వాతం కమ్మిందికామల్లు.

దేవు—వాతంకాదు, భూతం పట్టింది.

ముక్తి—పాపం ఎప్పుడూ ఏదో ముంచుకొస్తుంది.

దేవు—పాడు తాపత్రయాలతో ముంచుకురాక ఏమౌతుంది?

డాక్టర్ ప్రవేశం

(దేవుడు నిలబడును. ముక్తికాంత ప్రక్కకు పోవును)

దేవు—నమస్కారాలు డాక్టర్ గారు.

డాక్ట—ఏమిటండీ. జగన్మాతగారికి? (చేయి జూచును)

దేవు—ఏమిటోనండి. ఏం తెలియటంలేదు. స్నానాల విడుచుకుపడ్డదట.

డాక్ట—ఏమిటో కట్టారే? మాట్లాడుతారా?

దేవు—ఇంతవఱకూ మాట్లాడుతూ మాట్లాడుతూనే పడిపోయిందండి. ఇందుకే మా పెద్దవాడు మీకోసం పరుగెత్తుకొని వచ్చాడు. మీ కనపడలేదా?

డాక్ట—కనపడ్డారు లెండి. ఇంటికి వెళ్ళివస్తా.

దేవు—ఏం ప్రమాదం లేదుకదండీ?

డాక్ట—ఇంతమాత్రానికే? మతేం ఫరవా లేదు. మందు పంపిస్తా ఇవ్వండి.

దేవు—మావాడెక్కడికి వెళ్ళాడో మీతో వచ్చి మందన్నా తెచ్చేవాడు.

డాక్ట—క్లబ్బులో వున్నారు. వారి వైపూ, వారూ మంచిగేంలో వున్నారండి. వస్తా. (నడుచును)

దేవు—చిత్తం సెలవండి. నే నుంట.

డాక్ట—మంచిది మీ రుండండి. (నిష్క్రమించు)

ముక్తి—మాఅక్క ఏవేళ్ళకీ రాదేం? ఎప్పుడూ పాడైన ఆట లేనా?

దేవు--అ దెందుకు రావటం? కొట్టుకొని చావటానికా?

ఈ పాపిష్టిదాని యేముపుగాటే అదెట్లా వస్తుంది? అదీఅందుకే హాయిగా ఆటపాటల్లో పడివుంది. తెలివైనపిల్ల.

జగ—(లేచి) మన తెల్వి తెల్లవారై పోతే, తెలివైన పిల్లకాక యేమాతుంది? అబ్బ అబ్బ!

దేవు—ఆసి గడుసుదాన! మాట పడిపోయిందను కొన్నాం. ఇంకాయేం బాగానేవున్నావు. అందర్నీ చంపందే మట్టుకు నీవు చచ్చేదానవు కావులే.

జగ—అట్లాగే నోరు పారేసుకోండి. మీవాక్కే ఫలిస్తుంది. ఏమే ముక్తి! అట్లా నిలబడి చూడకపోతే కాస్త నీళ్ళకాపు కాయరాదు?

ముక్తి—కాస్తానండి. వేన్నీళ్ళతోనా? చన్నీళ్లతోనా?

జగ—నీ తెల్వి తెల్లవారినట్టే వుంది. చన్నీళ్ళతో కాస్తా రటే?

దేవు—ఆనీళ్ళే ఆఖరికిమటి...

జగ—అందాకా వచ్చింది లెండి. నారాయణమూర్తి తండ్రి! నన్నిన్ని చెఱల్లో బడేయుట మెదుకయ్యా? పుస్తె కట్టిన పెనిమిటికి కడుపునపుట్టిన బిడ్డలికి పనికిరానప్పుడు, ఎందులోఅన్నా పడిపోవటమే మంచిది.

దేవు—అంత తెగించేవాళ్ళెప్పుడూ, ఇంతమందిలో చెప్పనే చెప్పరు.

సత్యాగ్రహి ప్రవేశం

సత్యా—ఏమిటే నాన్నా?

దేవు—ఏముంది? రోజున్నగోలే.

జగ—చూచావా? రోజున్నగోలేట. మనిషికి దయా దాక్షిణ్యాలు లేకపోయినప్పుడు గోలగానే వుంటుంది.

సత్యా—ఏమిటే అమ్మా?

జగ—ఏం లేదు తండ్రీ! (దగ్గరికి తీసుకొని) నిన్నొక్కణ్ణి చూచిపోదామని వున్నా. అబ్బ అమ్మ!

సత్యా—వచ్చాగా ఫరవాలేదులే, చెప్పు.

దేవు—ఒరే! సత్యాగ్రహి! నీక్కూడా పట్టిందా ఏమన్నా?

జగ—వాడికే పట్టింది. అమ్మ అబ్బ!

సత్యా—బాధేమిటో చెప్పవే?

మాలా ప్రవేశం

మాలా—హేమ్టిహాండీ సాలా గోలా ఫెకుతుండార్!

సత్యా—ఏమిటో. ఎవరికీ చెప్పటం లేదు.

మాలా—హేదీ నాకీ సూణ్ణియండి. (చేయిచూస్తూ) రేపు వాయిదాలో లాభం బాగా వస్తుంది లే అమ్మా! కుమాళ్ళకి. దిగులుపడక.

జగ—వచ్చింది మాలాసాహెబుగారా?

మాలా—హా హేమ్టి! జరా బాత్ కర్ నఖో మైబోల్తా (చూచి) హారే హాంటో హేమ్టిలేదే? హిదీసూస్తే ఘాలి స్టేష్టగా హుంది. సందేహం లేద్. హిఫ్డూ యీమందూ హివ్వండి. దీనిసంగథీ నాకీ సెప్తా. హింకాఆలస్యం సేయారాద్.

జగ—ఏం చేస్తారు మాలాసాహెబుగారు?

మాలా— హేమ్టా సేస్తార్? మీకీ ఫట్టినాఫీడా వొదల కొడతార్.

జగ—అది చేశావంటేమట్టుకు చచ్చి నీకడుపున పుడతా, మాలాసాహెబుగారు.

మాలా—హరే మాకీ హెంమ్యా-హాండీ ఫీడా?

దేవు—ఈ పీడమట్టుకు ఎవరికీ లేకుండా చేయిసాయబు!

సత్యా—అయితే యిప్పుడేం చేయమంటారు?

మాలా—హేమ్టా సేస్తార్? ఫైనాభట్టా హయ్యా ఫీసీ పా రేయటానికి? దీన్కీ- సాలా ఫనీ ఫడ్తాద్. రహిరో హయ్యా రహిరో. సెప్తాగా. కాగజ్ లేవో!

సత్యా—(కాగితం తీసుకొని) ఏమిటో చెప్పండి. తీసి కొన్నా?

మాలా—బోల్తా. బోల్తా. లిఖో. ధల్వాఖిర్ సవా శేర్.

దేవు—ఇ దెక్కడ దొరుకుతుం దబ్బా?

సత్యా—తల్వాకిరు) సవాసేరు, సెప్పండి!

మాలా—హైంధీ, థోమా హుచ్చా సేర్.

దేవు—సరే భేష్. మంచి దినుసులే చెబుతున్నావ్.

సత్యా—ఇంకా తర్వాత చెప్పండి.

మాలా—బోల్తా బోల్తా. రహిరో హయ్యా! హాఖా షం పుష్పాల్. సెప్తా ఏక్, దో, తీన్, చార్, బస్. చార్ రాయండి.

దేవు—ఇం కేం? ఇది ఇదివర కెవ్వరికీ వాడని ఔషధం అన్నమాట. దీంతోగాని కుదరదు,

సత్యా—ఇంకా వున్నయ్యా?

మాలా—లేఖేమండి! హింకా సాలా ఫడాలా. హావీ మీకీ ధొర్కేవీ కావూ లెండి.

దేవు—ఇప్పుడు చెప్పినవి మూడూ దొరికేవే అన్న మాట.

సత్యా—ఇవి చాలంటారా? సాహెబుగారు!

మాలా—సాల్లెండి. థక్కినవన్నీ మై లావూంగ. మీకీమాత్రిం ఛేగీ రావాలా. అయ్యా! బడేబాబ్ జీ! థిర్గీ నేను హొచ్చిందాకా గదిలో ఫెట్టీ థాళం హేయండి. మై జాతా హూం. (నిష్క్రమించు)

సత్యా—అంతే నిజం చెప్పాడు. ఇప్పుడు మౌనవ్రతం చాలా అవసరం.

జగ—నాన్నా! సత్యాగ్రహీ! ధారక మేమన్నా కను కొన్నావా?

సత్యా—ధారకం గీరకం లేదు. ఇప్పుడేం మాట్లాడక. ఉపవాసమే పరమౌషధం అన్నారు.

ముక్తి—ఇహ అన్నానికి రాకూడదా. అందఱికీ తల్లు లున్నారుగాని అన్నాలు మానుకొని పూజించరు.

దేవు—నేనుగూడా మళ్ళీ డాక్టర్ దగ్గఱ కెళ్ళివస్తా. (నిష్క్రమించు)

సత్యా—పిచ్చదానా! నాతల్లి అందరితల్లులవంటిది కాదు.

సీ. అనివార్యశౌర్య సాహసలక్ష్మి వెనువెంట
పెద్దకోడలుయి గర్వించినమ్మ

మృదుకళామణి ఘృణీమేఘ కుటుంబిని
పాడికవ్వమయి నిల్వబడినమ్మ
రాగ భోగ యశశ్శరజ్జ్యోత్స్న విఱజిమ్మి
పెండ్లిపందిళ్లు కప్పించినమ్మ
అమృత ఝురీమృణాళ మరాళకోశంబు
జీవనాధారమ్ము జేసినమ్మ

గీ. ఇంత సంసారసాగర మీది యీది
నవ్యదివ్య సౌందర్య నందనకథా ప్ర
ఫుల్ల పద్మసద్మ సుధామతల్లియైన
నా జగన్మాతవంటి పుణ్యాపతు లెవరె?

ముక్తి--ఇంత భక్తివిశ్వాసాలందఱికుంటై. మీకేగాదు.

ఉ. నా తొలినోముపంట భువనమ్ములు నిండెడి పండువెన్నెలన్
కోతకువచ్చి కుప్పలు మనోహరమైన పొలాలలోఁ బడన్
మోత్రితలతోఁ గృపారసఝురుల్ ప్రవహించెడి యీ మహా జగ
న్మాతను గొల్చుభాగ్యము వినా, మఱియొక్కటి లేదు సాధ్వికిన్.

అత్తగారు నిద్రపోతున్నట్లున్నారు. అన్నం తినివద్దాం పదండి.
(నిష్క్రమింతురు)

దురాగ్రహి, హాలాహాలం ప్రవేశం

హాలా—అయ్యా! దురాగ్రహిగారు! మిమ్మ ల్నొక్కర్తె భూదేవమ్మగారు కబురుచేశారు, వారి సాక్ష్యం

కూడా మనతరఫున వ్రాసియిస్తారట. మీరే వెళ్ళి వ్రాయిం చుకొని రావాలి.

దురా—సరే. మన మింకా గెల్చితీరుతాం. రాణిగారి సాక్ష్యమే మనల్ని గెలిపించి తీరుతుంది. చూచావా మా అమ్మగారి దురవస్థ. చాద స్తంతో మరీ బాధపడుతున్నది.

హాలా—అంతే పాపం. నేను నా పనిలో వుంటా త్వరగా రండి.

దురా—సరే. (నిష్క్రమింతురు. తెర పడును)

2వ రంగం—భూదేవి మందిరం

[భూదేవి పరుండి యుండును.

పృథ్వీపతి క్రోధోద్రేకాల్తో ప్రవేశం]

పృథ్వీ... ఈ క్రూరజాతిని, యీ ఘోరదారుణమానవ జాతిని దయదాల్చగూడదు. నిర్లక్ష్యంతో విడిచిపెట్టగూడదు. ఈ సమస్త ధారుణీమండలాన్ని పాలిస్తున్న మావంటి ప్రభు మండలి చేతిలో భయంకర శిక్షాదండమే లేనినాడు, ప్రళయ కాల మృగసమూహాలు రాజ్యంలో జొరబడక మానవు. అంచేత ధర్మపరిపాలనాదక్షుడైన ప్రభువుగూడా లోకభీకర చండశాసన శిక్షాదక్షుడు కావాలి. (భూదేవిని చూచి) ఓహో ఈ భూదేవి, తన పాపిష్టిప్రజలకోసం కలవరిస్తున్నది. ఏమిటో కొంచెం వినినగాని తెలియదు. (ప్రక్కన నక్కియుండును)

భూదే— నా నిరుపేద తనయులారా! నా కష్టజీవు లారా! భయపడకుడు. ఈ భూదేవి గొంతులో ప్రాణ మున్నంతవరకూ, నా సర్వస్వమూ మీకోసం ధారపోస్తాను.

మీ రంతా ఐకమత్యంతో వున్నంతకాలం మిమ్మల్ని యీ క్రూరులు, యీ నిరంకుశప్రభు భోగపరాయణులు ఏమీ చేయలేరు. తప్పకుండా నేను రేపు వచ్చి మీపక్షం సాక్ష్యం చెప్పితీరుతాను. ఈ పరకాంతాపిశాచ దాసదాసాధముల ప్రగల్భాలు కట్టిపెడతాను. నా కష్టజీవులారా! జడవకండి.

పృధ్వీ—(లేచి) ఓసి! క్రూరురాల! ఎంత రాజ ద్రోహానికి సాహసించితివే! ఇహ సహించను. కడకు నీవు కూడా నన్ను నిరాకరించి శత్రువులకు సహాయం చేయటానికి లేచితివా? ఈ నీ సహాయ మేమిటో చూచెదగాక.

భూదే—(లేచి) ఎవరు వారు?

పృధ్వీ—నీ శత్రువు.

భూదే—(చూచి) నాకు శత్రువు లేదు.

పృధ్వీ—నీ ప్రజల్ని, నీ కష్టజీవాల్ని హింసించు వాడు శత్రువుకాక మ ఔవడు?

భూదే—మీధోరణి నా కేమీ అర్ధంకావటం లేదు.

పృధ్వీ—రాజద్రోహులకు అర్ధంకాదు.

భూదే—సరేగానీండి. ఎందుకీ అకారణ కలహం?

పృధ్వీ—అకారణ కలహమా? ఇహ నీవాగుడు కట్టిపెట్టు.

భూదే—మీ దారుణ సాహసకృత్యం కట్టిపెట్టండి. కన్నబిడ్డలవంటి ప్రజల్ని కాపాడి సంస్థానాల గౌరవం నిలపెట్టుకోనండి.

పృధ్వీ—ఊరుకొన్నకొద్దీ నీకు ప్రజావిశ్వాసం ముదురుతున్నది. రాజ్యం ఇంత అరాజకమైనది నీమూలంచేతనే మూర్ఖురాల! ఇహ నిన్ను క్షమించకూడదు. (నిష్క్రమించు)

భూదే—దైవమా! నీకు ఇంత మందమతి రావటం వల్లనే నీతమ్ముడు పృథ్వీపతి కన్నుమిన్ను గానకుండా తిరుగుతున్నాడు. ప్రజల్ని పీడించుకొని తింటున్నాడు. దైవమా! ఇంత మహాప్రళయంలోనైనా కన్ను తెఱవవా? కష్టజీవుల్ని కరుణింపవా! ఓ బ్రహ్మాండములారా! మీరైనా నా ప్రభువుకీ, నా ప్రజలకీ రాజీచేసి రాజ్యాల్ని కాపాడండి.

(రివాల్వర్ పట్టుకొని ఉగ్రుడై పృథ్వీపతి ప్రవేశం)

పృథ్వీ—ఓసీ. క్రూరురాల! ఏమిటే ప్రేలుచున్నావు? నీచాతినీచులైన ప్రజల్ని, దురంత ఘోర నరహంతకులైన ప్రజల్ని తెగబలిపించి, తిరుగుబాట్లు జరిపించి ప్రభుహత్యచేయిస్తున్న పాపిష్టురాల! (జుట్టు పట్టుకొని) నిజం చెప్పు. లేకున్న నీకు మూడినదే! రాజధర్మములు వదలి నీ వెందుకు వీధి కెక్కితివో చెప్పు? ఎవణ్ణి మఱిగి నీ వింత సాహసకృత్యానికి దిగితివో చూడాలి.

భూదే—విడవండి. ఇది మీకు ధర్మంకాదు. నేనేమి మీ కపకారము చేయలేదు. మీ కన్నబిడ్డలవంటి ప్రజల్ని కాపాడి వంశప్రతిష్ఠ కాపాడుకోమని చెప్పాను. వినువండి ప్రభూ!

పృథ్వీ—నీప్రాణం తీయనిదే వదలిపెట్టను. నామీద పాపిష్టిప్రజల్ని తీసుకొని దండెత్తెదవా? కుకర్మురాల!

భూదే—ప్రభూ। నేను నీచేతిలో ప్రాణము విడుచుటకంటే నా కింకొక పుణ్యమార్గము లేదు. కాని! మహాప్రభూ! నన్ను మీరు చంపుకొన్నచో మీ బిడ్డలవంటి ప్రజలకు తల్లి

లేకుండా పోతుంది. మీకు నానా బాధలు వచ్చిపడ్తై, విడవండి.

పృథ్వీ—ఓసీ! ప్రాణఘాతకీ! భూదేవీ! నిన్నిహ సమస్త దేవతలకీ బలియిచ్చి నా రాజ్యానికి పట్టుకున్న పీడని వదలించుకొంటాను. (రివాల్వరు తీయును)

భూదే—(చూచి భయకంపితయై) ఓ సమస్తదేవతలారా! ఓ పరమపవిత్రమైన యోగిపుంగవులారా! ఓ గంభీర దయాసముద్రులారా! ఓ ప్రచండ శాసన కారణ నిర్వహణ దక్షాలక దిగ్గంతులారా! నేడు మీరుగూడా భూదేవిని కాపాడలేరా? అయ్యో అయ్యో! దైవమా! ఈ భూదేవిని నీపొట్ట పెట్టుకొనిగాని నీ యాకలిమంట చల్లారదా? ప్రభూ!

(పాదములమీద పడి)

గీ. సృష్టికర్తకు భక్తితో చేయుచున్న
నా సువర్ణసుస్నిగ్ధ రత్నాలపూజ
నీ పసిడిచేతిలో బలి నిశ్చయించె
ఏమి కావలె భూదేవి కింతకంటె?

(కాళ్ళు పట్టుకొని)

పృథ్వీ—ఛీ! పాపిష్ఠురాల! నీవల్ల నాకుగానీ, రాజ్యానికిగాని సుఖం లేదు. పొమ్ము. దయతాల్చరాదు. (పడద్రోసి) ఛీ! నీచురాల! (ఫైరుచేసి పారిపోవును)

భూదేవి పడిపోవును.

(శ్రీపాదవాద్యములు వాయించుచుండవలెను)

మారువేషముతో దురాగ్రహి ప్రవేశం

దురా—తల్లీ! భూదేవి! ఎందు కిట్లా పడిపోతివమ్మా

(చూచి ఆశ్చర్యంతో) ఏమిటీ రక్తం? అయ్యయ్యో! నాతల్లిని నా భూదేవిని, ఏ మూర్ఖులిట్లా పొట్టబెట్టుకొన్నారో! ఎవరో గాదు. ఈ నిరంకుశసంస్థాన కిరాతకులే.

(పృథ్వీపతి, డాక్టరు, కోలాహలం, పోలీసులు ప్రవేశం)

పృథ్వీ.—నరహంతకుడు వీడే. పట్టుకోండి ముందు.

పోలీసులు—(పట్టుకొని సంకెళ్ళు వేతురు)

దురా—నేను కాదు హంతకుణ్ణి.

డాక్ట—మాట్లాడక. నీవే హంతకుడివి. పదా.

(నిష్క్రమించును. తెర పడును)

3వ రంగం. ఖైదు.

[తుపాకులు పట్టుకొని పోలీసులు రెండుప్రక్కల వుందురు. సంకెళ్ళతో దురాగ్రహి ప్రవేశం]

ఎంత అన్యాయకాలం దాపరించిందో చూడండి. దురాశా పిశాచాలై దురంత దురాచార దుర్నీతి దుంబుభులై యీ నిరంకుశ ధనమదాంధులు, యీ నిరర్థక వేదశాస్త్ర పండిత వేదండములు కలిసి యెట్లా మహామారణయంత్రశక్తుల్ని పేర్మించి, బంగారుతల్లియైన భూదేవిని వధించి, యెంత నిర్దాక్షిణ్యంగా విహరిస్తున్నారో చూడండి.

ఉ. ఈతరుణమ్ములో పురుషుఁ డెవ్వఁడు లేడె? స్వతంత్రవీర వి
ఖ్యాతకిరీటధారులు భయంకర మారణయంత్రశక్తి దు
ర్నీతికి దాసులై యకట నే డెటువంటి యెడారిలో జగ
న్మాతను దింపిరో కనుఁడి మండెడియాశలిమంట లేచెరా!

నా విశ్వజన సోదరులారా! కష్టజీవులారా!

ఉ. ఈ వడగాడ్పు దెబ్బకు మహీస్థలి నూతులు తీసిపోయి జీ
వావళి గోలపెట్టుసమయంబున ఏ పెనుతాతినూతిలో
జీవన మింత చూచుకొని జీవములన్ నిలపెట్టుకొందు రీ
ఆవిరికాలమం దెవరికైనను దోసెడు నీళ్ళుపుట్టవే.

ఇంత రత్నగర్భయైన జగజ్జనని యెంత ప్రళయకాలంలో ఘోషిల్లుతున్నదో చూచుకోండి. ఈ ప్రళయకాలగర్భం నుంచి వినూత్న విశ్వస్వరాజ్య ప్రభాతలక్ష్మిని పిలుస్తున్న కవి కూత వినండి. అక్కరకురాని ఆడంగిరేకుల పాటలు కట్టిపెట్టండి. విశ్వశ్రేయస్సుకోరని వెట్టివ్రాతలూ కూతలూ వినకండి. కోడికూత విని ప్రభాతలక్ష్మి వచ్చినట్లు, కోకిలకూత విని వసంతలక్ష్మి వచ్చినట్లు, కవికూత విని భావికాల విశ్వభాగ్యోదయం రావాలి. విశ్వస్వరాజ్యప్రభాత లక్ష్మిసాక్షాత్కారం కావాలి. అటువంటి కవికూత వినాలి.

ఆకలిమంటమంటి ప్రళయాగ్నికణమ్ములు చిమ్ముచున్న ము
ల్లోకపు మండుటెండలకు లోతుకు పోయిన బక్కడొక్కతో
దూకుడుగా పొలమ్ములను దున్నుచు రొప్పుచు, సొమ్మసిల్లి నే
డీ కవికర్షకుండు చను టెక్కడికో కనం డొక్కడేనియున్.

డాక్టరు, కోలాహలం ప్రవేశం.

డాక్ట—విశ్వాసఘాతకా! మనుజహంతకా! ఏది? నీ ప్రజాశక్తి? ఏది నీ ప్రతిభాశక్తి? నీఉరి తప్పించటానికి వొక్కరూ రా రేమి?

కోలా—చక్కని భూదేవిని కాస్తా నీ పొట్టపెట్టుకొన్న దానికి తగినశాస్తి జరిగినదా?

దురా—ఈ మహాప్రళయం మీవంటి సుఖభోగ లాలసులకోసమే వచ్చింది. మీవంటివారి తప్పుడుసాక్ష్యాలతో నా కఠశిక్ష పడిందని కలకకండి. రేపు మీగతులు చూచుకోండి. వస్తున్నది సంక్రాంతి, పొంగిపోకండి.

ఉ. ఆరెలువచ్చి ప్రుంజులు తయారయి కచ్చెకు లేచి; చూడ్కి చ
ల్లారని పౌరుషమ్మున రణావని కెక్కిడి కూతబెట్టి, దు
ర్వారమహామహీరుధిరవాహిని పొంగెడి కత్తిగట్టి, బం
గారపు క్రొత్తలోగిలికి గట్టెవె రత్నపుతోరణమ్ములన్.

డాక్ట—వాగును కట్టిపెట్టు రేపటితోగాని నీరోగం కుదరదు.

కోలా—వాగనీండి. రేపు మెడ తెగేదాకా అట్లాగే వాగుతుంటాడు. (నిష్క్రమింతురు. తెర పడును)

4వ రంగం. వీధి.

కీర్తన పాడుకొంటూ హాలాహాలం ప్రజతో ప్రవేశం

కీర్తన

పేదోళ్లలోగిళ్ల కేదిరా దిక్కింక
భూదేవిప్రాణాలు గోదారి చేశారు ॥పేదో॥
ముల్లోకములుగూడ అల్లాడిపోతుండె
ఓదార్చువా రేరి? చల్లార్చువా రేరి?
ఆకలీమంటలూ లోకాల కెక్కాయి ॥పేదో॥

నా విశ్వజన్మ సోదరులారా! మన బంగారుతల్లిని మన రత్నాల తల్లిని పొట్టపెట్టుకొన్నారు. సోమరితనాన్ని యెఱగని కష్టజీవాల్ని కాపాడుతున్న మన భూదేవిని ఈ మహామారణ

యంత్రాలకి బలియిచ్చారు. సోదరులారా! ఇటువంటి పేద వాళ్లతరఫున సాహసించి సాక్ష్య మివ్వటానికి వస్తున్న మన భూమాతను పెద్దపులుల పొట్టపెట్టారు. ఇంకా ఎన్నియుగాలకైనా యిటువంటి దరిహారస నిర్ఘరిణిని ఇంత అవ్యాజ ప్రేమ కళాజగజ్జననిని మనం చూడగలమా? మన కష్టాలు గుర్తించి కనికరించి, మనకోసం సర్వస్వమూ ధారపోసిన దురాగ్రహిని గూడా పట్టుకొని యురిశిక్ష వేశారు చూశారా? ఎంతధర్మమో మనగుఱించి కరిగి కన్నీరు కాల్వలైకట్టిన మన కన్నతల్లిని యీ నిరంకుశ పిశాచనిశాచరులు చంపి, యేమీయెఱుగని, నిరపరాధిమీద దురాగ్రహిమీద యింత మహాఘోరం మోపి, వురితీసి జగన్మాతకడుపు పగులకొట్టపోతున్నారు. నా విశ్వజనకష్టజీవులారా! మన సర్వస్వమూ ధారపోసి మన దురాగ్రహిగారి శిక్ష తప్పించటానికి పోదము రండి.

(కీర్తన పాడుకొంటూ నిష్క్రమింతురు)

జుట్టు విఱబోసుకొని శక్తికాంత ప్రవేశం

శక్తి—ఇంత భయంకరలోకంలో యీ శక్తికాంతకు దిక్కేది? కాపాడువా రెవరు? మేడలు కూలినవి, సముద్రములు పొంగినవి. నా కిక దరియేది? ఈనాడు న న్నింత నీచంగా చూడటం న్యాయమేనా? దైవమా! నీవైననూ కనికరించవా? ఆకలి. అబ్బా! ఆకలి. అదిగో! ఎక్కణ్ణుంచో తిరుగుబాటు గుంపు వస్తున్నది. ఇహ ఈ శక్తికాంతను కరుణించు కరుణా సముద్రులు లేరా? అమ్మో! అదిగో! వస్తున్నది. భయం. అమ్మో అమ్మో (పారిపోవును)

దేవుడూ, జగన్మాత, ముక్తికాంత, సత్యాగ్రహి
బిక్షా పకీరులై ప్రవేశం

దేవు—బిడ్డా! సత్యాగ్రహి! మీమాటా మిమ్మల్ని నమ్మి, మీ పూజాపునస్కారాలకీ మీ శతసహస్ర నమస్కారాలకి కడకు నేనుగూడా మోసపోయి యీ నిరంకుశ ధన మదాంధులలో చేరి యెటువంటి రత్నగర్భను గంగలో గల్పుకొంటినో చూచితిరా? ఇంకా యీ దిక్కుమాలిన కొంపలో, యీ మహాభయంకర క్షామదేవత తాండవిస్తున్న కాలంలో, యీ దేవుడి మొహం ఎవరు చూస్తారు? పూజిస్తారు? నాకే పుట్టగతులు లేక యేడ్వవలసిన కాలంలో యీ పనికిమాలిన దేవుణ్ణైన నన్ను పట్టుకొని కూర్చుంటె మీ కేమీ రాదు పొండి. నీ తల్లినీ, నీ ముక్తికాంతనీ తీసికొని యెక్కడైనా ఇహానుంచి జాగ్రత్తగా బ్రతుకు. సత్యాగ్రహీ! నావెంట వుంటే మీ కేమీ రాదు.

సత్యా—తండ్రీ! దైవమా! భయపడవలసిన పని లేదు, పృథ్వీపతి, కోలాహాలం, డాక్టరు మొదలైనవారు మనదగ్గిరకే వస్తున్నారు. వాళ్లనుగురించి మన మంతా సాక్ష్య మిచ్చి కష్టపడ్డాం. వృధా చేయకు.

దేవు—పిచ్చివాడా! నీ వింకా వీళ్లమీదే భ్రాంతిపెట్టుకొని కొట్టుకొంటున్నావు. వచ్చారు పాపం. అడుగు.

బిక్షా పకీరులై పృథ్వీపతి, డాక్టరు, కోలాహాలం ప్రవేశం

కోలా—దైవమా! నమస్కారములు.

(అందరూ నమస్కరింతురు)

దేవు—ఏమిటయ్యా! కోలాహాలం! మళ్లీ వీళ్లనందర్నీ వెంటపెట్టుకొచ్చావెందుకు?

కోలా—దైవమా! అనుగ్రహించాలి. మేమంతా కష్టకాలంలో పడ్డాం. మాకూ, మా ప్రభువులకూ దైవమా! నీకంటే దిక్కెవరూ లేరు. పెద్ద కరవులో పడ్డాం. ఆకలి మంటలో మా పిల్లా జెల్లా మాడిపోతున్నాం. కరుణించాలి.

దేవు—చూచావుటే! సత్యాగ్రహీ! వీళ్లేమో! మిమ్మల్నీ, నన్నూ ఉద్ధరించటానికి వస్తున్నారన్నావే, చూచావా? వీళ్ళ వుద్ధరింపు, నీ అన్నయ్యనీ, భూదేవినీ, కష్ట జీవాల్నీ పొట్టపెట్టుకొని యింకా చాలక మనపాలబడి మనల్ని యేడిపించుకొని తిందామని వచ్చిన మొహాలు. ఇంకా యిటు వంటివాళ్ళని పట్టుకొని యేడ్వమంటావేమిటి?

సత్యా—తండ్రీ! పాపం. మనతోబాటు ప్రభువులకూ ప్రభుత్వాలకూ కష్టాలు వచ్చిపడ్డై. వాళ్ళుమట్టుకేంచేస్తారు?

దేవు—ఏడ్చినట్లేవుంది నీ శాంతమూ సత్యాగ్రహమూ! అదిగో కష్టజీవాలుకాంబోలు వస్తున్నారు. మన మంతా కలసి వాళ్ళని వేడుకొంటేనే మన కష్టాలు తప్పేది. మన ఆకలిమంట చల్లారేది. వాళ్ళే నాకంటికి న్యాయధనులు ధర్మశూరులు. వీళ్లముందు ఇహ నిల్వలేము. గెల్వలేము. పదండి కాళ్ళు పడదాం.

మహాజనంతో కీర్తన పాడుకొంటూ హాలాహాలం ప్రవేశం.

హాలా—దేవుడా! ఈనాడు నీ దేవత్వం తెలియాలి. కదలనీయము. (అంతా చుట్టు ముట్టడింతురు) ఇన్నాళ్లనుంచీ

ఇన్ని దేవాలయాలలో ఎన్నెన్నో నైవేద్యాలు తెగమెక్కి బలిసిన నీవుకూడా మా భూదేవిని బ్రదికించుకొనలేవా? మా కష్టజీవాల్ని కనిపెట్టలేవా? బంగారపు గుళ్ళుగోపురాలలో కులుకుతున్న దేవుడా ఏదిరా నీ సత్యమూ, మహాత్మ్యమూ? కానరాని నాలిముచ్చు దేవుడా! నీవుకూడా భాగ్యవంతుల చంకకెక్కి చెడిపోయినావు. నీ ధర్మబలం నీరసించింది. నీ విశాల విచక్షణాదృష్టి వినాశమైంది. సమస్త వేదశాస్త్ర పురాణాలలో తయారయినట్టి నీ నవనీతహృదయం గడ్డకట్టి కఠిన పాషాణమైందా?

ఉ. కన్నకుమార్కెకై కడుపు కాలువలైన ధరాలలామ నే
డిన్ని విపత్పరంపరలు హెచ్చి కృశోదరియై నిశీథిలో
నిన్ను స్మరించి యీ పరమనీచుల చేతిలో చచ్చెనింక నీ
కన్నులు విప్పవా? పుడమి కర్మ్యనుదీర్పవ? మాయదైవమా

దేవు—తండ్రీ! హాలాహలమా! నాకు నిజమైన కుమారుడవు నీవుగాని వీళ్ళుకాదు. ఓ నిరంకుశ నీచభాగ్యవంతులారా! యీ కష్టజీవాలే ధర్మమూర్తులు. జగచ్ఛాసనకర్తలు. సమస్త విశాల విశ్వసామ్రాజ్యం వీరివల్లనే వచ్చి కడగండ్లు తీరుతై.

మంగళం. మంగళం. మంగళం.

(తెర పడును)



